# సంగీత ఇంద్రసభ

(కల్పితమైన మూడంకముల ప్రహసనరూపకము)



గ్రంథకర్త:
బి. టి. రాఘవాచార్యులు



శారదాభాండార ముద్రాక్షరశాలయందు, ముద్రితము.

సర్వస్వామ్య సంకలితము]

[వెల పోస్టేజీకాక 1—4—

# పీఠిక

నాట్యకళ నానాట నానావిధముల హీనగతుల పాలగుచున్నది. ప్రేక్షక నాటక సంఘము లసంఖ్యాకము లగుచున్నవి. కాని, అట్టివేగముతో నటుల సంఖ్య పెరుగుట లేదు. ప్రజలయందు నాటకముల వీక్షించు కుతూహలము వృద్ధియగుచున్నది. కాని ప్రదర్శనములయందు ప్రజల కుతూహలమును పెంపు సేయు సౌభాగ్యము క్షీణించుచున్నది. నాటకప్రదర్శనములకు గల రాబడి మఱియొక వ్యాపారమునందు గన్పట్టుట లేదు. కాని సంఘసంస్థాపకులకు నష్టమే యగుచున్నది. నాటకములన్న పూర్వ మెచ్చరికము పొందు అది నానాట త్రిగుణ గమనముతో తొలంగి పోవు చున్నది. కాని, దినక్రమముగా ప్రేక్షకసంఘమునందా యెచ్చరికము పెరుగు చున్నది. కారణ మేమో తెలిసికొన నలవి గాకున్నది.

సంస్థాపకులు తమకుగలి నష్టమును సహనముతో భరించుచు నేయున్నారు. ప్రేక్షకులు తమ యెచ్చరికము నింకను తీవ్రముగా వెలి బెట్టుటలేదు. నటులకు నాటకసంఘములకును సభ్యులనము లిచ్చియో ప్రోత్సాహకర ధనమో ప్రేక్షకులు తమధనము వ్యయము గావించి బహుమానము లొసంగుచు నేయున్నారు. పత్రికలలో పొగడ్తలు కాన్పించుచు నేయున్నవి. కాని నటులకు నాటకసంఘములకు నెచ్చరిక పుట్టుట లేదు. కారణము గోచరించుటలేదు.

పూర్వము వలె గాక నేడు నటులకు వేషధారణ మొక జీవనదాయకమైన వ్యాపారమైనది. విపులవిద్యా సంపన్నులకు గల్గు రాబడికంటె వీరి కధికాదాయము గలుగుచున్నది. అంతియగాక విద్యాధికులయందు సన్మానమూ ప్రజలయం దధికమగుకీర్తి సులభముగ సంప్రాప్తించుచున్నది. కాని నటులకు కళాభిమాన మించుకంతయు నున్నటు గానబడుట లేదు. కత మేమియో గూఢముగానున్నది.

నాటకములు వేలకొలంది రచింపబడుచునే యున్నవి. శ్రవ్యప్రబంధములు నవలలు, మొదలగు నితరవిధగ్రంధరచన లేనే లేదు. పద్యములల్ల నేర్చినా, నాటకము, పద్యముల్లు నేర్పులేక కేవల మొకింత భాషాజ్ఞానమే యుండెనా; నవలలు రచింపబడుచుండెనవి. అదియునుగాక, సంగీతమును తోసిరాజనిపించదలంచిన కొందరు నవలలుకూడ నాటకములుగనే రచించుచున్నారు. ఇతరవిధగ్రంధములం గొను వారెవరు? చదువు వారెవరు? నవలయో నాటకమో యిప్పటికి చదువదగిన పుస్తకము. అందు నాటకమే ప్రధమస్థానమాక్రమించినది. అయినను నాటకప్రదర్శనములు ప్రజల కుతూహలమును వృద్ధిపొందించుటలేదు. ఎందువలనో గ్రహింప సాధ్యము కాకున్నది.

ఆంధ్రవాఙ్మయ ప్రపంచమున నిక్కాలము నాటకయుగమో యనునట్లు నాట్యకళాప్రస్తావము గావించువారు నిఖిల వ్యాపారముల వారునున్నారు. కవులు

నాటకములను రచించు వారేగదా! న్యాయవాదులు, పెద్ద పరీక్షల నారితేరిన వారు వర్తకులు వివిధవృత్తాంతము తెలిసిన వారే. వైద్యులు శరీరధర్మవేత్తలు. సంగీత విద్వాంసులు నాదోపాసకులు. పత్రికాసంపాదకులు సర్వవిషయపరిజ్ఞానసమర్థులు. కర్షకులు, అల్పసంతోషము గలవారు. విద్యార్థులు ముందు నటులుగా ప్రేక్షకులుగా కావలసిన వారగుట వీరిలో నెవ్వరు నాట్యకళానుభవము లేనివారు? వీరెల్లరు విమర్శకులు పరిబోధకులే అయిననేమి కళాభివృద్ధికరములైన సాధకములు మాత్రము బోధపడుటలేదు.

ఎట్లు బోధపడును? నాట్యకళారంగము దిక్కులేని దివాణము-పాడుపడిన దేవళము-ఏమూల నేమి హత్యజరుగుచున్నను ఎందే జూదవాదములు సాగుచుండినను ఏపత్రిక నేమి సురాపానాద్యపభ్రంశములు ప్రవర్తిల్లుచుండినను బయల్పడవు గదా. రసభావార్థజ్ఞానశూన్యులును, ఏవంవిధ వివిధ ప్రేక్షకసమూహమును గలసి ఆదిక్కులేని దివాణమును, ఆపాడుపడినదేవళమును, ఆక్రమించుకొని తందనా లాడుచున్నారు. న్యాయవాదులకు, ఉపాధ్యాయులకు, సంగీతపాఠకులకు, కృషీవలులకు, విద్యార్థులకు, ఎల్లవారలకును, అభ్యసింపవలసిన విద్యలు, చదువవలసిన శాస్త్రములు ఆరితేరవలసినపరీక్షలు, నున్నవి. ఒకదానిలోను తీర్ణులైనవారు మరి యొకదానిలో నక్కరకు రారు. కాని నాటకవిద్యకు అభ్యాసమక్కరలేదు. చదువ నక్కరలేదు. పరీక్ష లవసరము లేదు. పరిజ్ఞానముతో పనిలేదు. ప్రేక్షకులు తాత్కాలికపు సంతోషముతో తృప్తి పొందుచున్నారు నటులు తమకు లభించెడు నాదాయముతో తృప్తి పొందుచున్నారు. విమర్శకులు వాదప్రతివాదములతో తృప్తిజెందుచున్నారు ఇంక మిగిలిన వారు సంఘసంస్థాపకులు. వారు ప్రజ్ఞకై పెనగులాడుచున్నారు. భారమంతయు వారి శిరములయందే యున్నది వారి నాశ్రయించిన నటుల నెట్లు విడువ, జాలక పోషించుచున్నారో, అట్లే వారి పాల బడిన నాటకకళను పోషించి సుగతులకు దీసికొనిరా వలసిన భారము వారికుండు గలదని వారుగుర్తించుచుండ లేదనుట నిర్వివాదాంశము-

నాట్యకళ యెన్నడు మంచిత్రోవ బట్టునని యేనటు లడిగినను, సంస్థాపకులు తగినంత శ్రద్ధ దీసికొన్నపుడే యని సమాధానముచెప్పును. వానికేమి? వాని నాదాయము చేయుచున్నదా? ప్రజలయందభిరుచికంటె నభిమానమే ప్రధానము వారి వలన నా వారి కనుకూలురగు నటులకు తగినప్రోత్సాహము లేకపోవుచున్నదా కష్టపడి విద్యాభ్యాసము చేయవలసిన దుర్గతి వారి కేల వచ్చె? ఇతర వ్యాపారము లందలి యుద్యోగులకు వలె, కష్టపడకున్నను జీతబత్తెములు ముట్టవనుభీతి వీరికి గలదా? అదిగాక, లేని భారము పైవేసికొనుటయు, నిందాస్పదులగుటయు, తనకు మాలినధర్మము.

దైవానుగ్రహము కలిమిని, ఇంచుకంత గానమున కనుకూలమైన కంఠనాదము [illegible] కొండు పెట్టుచుండగా, దాని గౌరవము పాడుచేసి, నటనమును క్రొత్త

దాని నాశ్రయించుట కేమి యవసరము? పుట్టిననాటనుండియుఁ దమ్మాశ్రయించి చదువులు సంధ్యలుమాన్పి, ప్రథమమున నెల్లవారి నిందలకు పాత్రుల గావించి తుదకు జీవనాధారమైన యా కంఠస్వరమున, న్యాయవాదులు, వైద్యులు, విద్యార్థులు, కర్షకులు, అందరికంటె నధికముగా సంగీత విద్వాంసులు కూడ మోహపరవశులగుచుండగా, దాని నవమానించుట, కృతఘ్నతను సూచింపదా? ఇన్ని విశేషములుండగా నాట్యకళ యెట్లభివృద్ధి జెందగలదు?

అది గాక, కళాభిమానము గలిగి, తత్స్వరూప, స్వధర్మాదుల చక్కగా గుఱుతెఱింగి, సంపూర్ణముగా దాని గుట్టుమట్టులు తెలిసికొని, దానికి తమ జీవితము ధారవోసిన, పరిజ్ఞానసంపన్నులుండిన గదా! నిర్దాక్షిణ్యవిమర్శకు లుండినగదా! అట్టి విమర్శనలు నిరాటంకంబుగా నిష్కళంకహృదయముతో ప్రకటించు పత్రిక లుండినగదా! కళాభివృద్ధియగుట!

ఒక చిన్నకథ గలదు. ఒక స్త్రీ పెనిమిటిని నిత్యము నాహారమునకై పీడించుచుండెను భర్తనిర్లక్ష్యముగ నే సమాధానము చెప్పక తన పనుల చక్కబెట్టుకొనుచుండెను. ఆమె యొకనాడు, భర్త యింటికి వచ్చుసరి కన్నము వండక, ఆయన రాగనే విస్తరియుంచి యెదుట నిలచి, చట్టి చేతులతో వడ్డించుచు నిది యన్నము, ఇది కూర, ఇది చారు, అనియూహించుకొనుడు అని యూరకున్న, ఆకలిగొని యున్న ఆతడు, ఒక మొట్టు మొట్టి యిది నాగరా మెడపై నొక దెబ్బ గొట్టి యిది కంజెర, నడుమున నొక తన్నుతన్ని యిదియుడ్డాణము ననుకొనుమని, సమాధానము చెప్పగా నన్నము వండి వడ్డించెనట, ఆవిధముగనే, నేటినటులు లోక పద్దెము పాడి యిది శృంగారము, ఒక గంతు వేసి యిది రౌద్రము, ఒక కులుకు కులికి, యిది శోకము అని భావింపుడనఁగా, సహృదయులగు నీ ప్రేక్షకులు, కాబోలు నని సంతసించి,

ఉ॥ బిరుదము లిచ్చువారు సరవిన్ పతకంబు లొసంగువారు సం
బరపడి పత్రికావళులఁ బద్దెముల న్నుతియించువారు; ప
ల్వురు; న్నిటులుండ నీనటులు, పూనిక నాట్యకళాభివృద్ధికై
కర మనురక్తిమై నడలగల్గుదురే, కాశికాని కొక్కరుఁ॥

అంతియకాక, యీకళను గూర్చి విమర్శించు వారిచిత్రవాదముల గూడ యొకింత విచారింప వలసియున్నది. కవులు నాటకరచనాభిలాషులే గాని నాట్యకళయం దభిమానము గలవారు కారు. ప్రదర్శనానుకూలముగ నాటకములు రచించుటకు, వలసినది గణయతి ప్రాసలక్షణ పరిజ్ఞానమే కాదు. నవ్యాకరణ వేత్తృత్వమే కాదు. వీటితోపాటు ప్రకృతితత్వ జీవనరహస్యములు సాంగోపాంగముగా నెఱియవలయును. ఆవిశేషము లెఱింగిన వారే, నాటకములు ప్రదర్శన యోగ్యములుగా రచింపగలరు. అట్టి పరిజ్ఞానసంపన్నులు లేని వారి రూపకములు కొన్ని శ్రీవ్యాపి

బంధములు, కొన్ని నవలలు, కొన్ని యుపన్యాసమంజరులు కొన్ని పురాణములు, మరికొన్ని హరికథలు. కాదందురా ఈవిమర్శల కర్థమేమి- నాటకములందు పద్యములు విస్తారముండరాదు. అక్కడక్కడ కొన్ని కీర్తన లుండ వచ్చును. అనగ నేమి? నే నీప్రశ్నము లడుగుచున్నాను. ఎవ రేమి సమాధానము చెప్పెదరో. ఎన్ని పంక్తుల వచనమునకు పిమ్మట నే వృత్తమున పద్యముండ వలయు? ఎన్ని పుటల కొక్క కీర్తన నుండవలెను? సమాధానమునకు వేచి యుండెదను.

మఱియొక వివాదాంశము. పద్యములకు రాగ మక్కరలేదా యుండవలయునా? ఎంతగా యుండవలయు. ఈకొలతయెవ్వరైన చెప్పగలరా;

నటుల కే యే విద్యలయందు పరిజ్ఞాన మెంతగా నుండవలయునన్న సమాధానము గలదు నాటకకవులు నాట్యరంగమున ప్రవర్తించెడు వారు కాకపోయినను ప్రదర్శనా లక్షణము గుర్తింప గలవారై యుండినచో వారు రచించు నాటకములు ప్రదర్శనానుకూలములై యుండు ననుట నిస్సంశయము (నటనాపరిజ్ఞానమున్న నేటినటుల ననుసరించి, అని భావింపకుందురు గాక!) ఇంతకును, ఈవాదానువాదములు త్రాడు బొంగరము లేని యాటల వంటివి ఏలయన, మనపూర్వికులు నాట్యవిద్యను కూడ సంపూర్ణముగ విమర్శించి యుండగా, వాటిపొంత పోవజాలక యిన్నికడగండ్లకు లోనగుచున్నారము భారతీయ నాట్యశాస్త్రము జర్మనీదేశమునం దాదరము గాంచుచున్నది. ఫ్రాంసు దేశీయు లా గ్రంథమును తమలిపిలో నచ్చొత్తించుకొని యుపయోగించు కొనుచున్నారు. ఇట్లుండగా, మనము, పెరటిచెట్టు మందునకు గాదన్న సామెత యేల వ్యర్థపఱుపవలెనను చింతతో నున్నటుల యేల ప్రవర్తింప వలయును? అభిమానము గల నటులును కవులును నాట్యశాస్త్రాధ్యయనము చేయు దీక్ష గలిగి నాట్యకళాభివృద్ధి యొనరింతురు గాక! అయిన నటులిప్పుడు కావించు నది రసప్రదర్శనము కాదా అందురేమో కాదు, అనునది రసాస్వాదనమును గూర్చి చర్చించు కొన్న తేలును.

ద్రౌపది దుశ్శాసనునిచే సభకీడ్చుకొని రాబడుచున్నది ఆ పాత్రము కీర్తన పాడుచు ప్రవేశించును. సభికులు (once more) మఱియొకసారి అన్ని కేక వేయుదురు. అతిరిని శోకదేవత యనదగు ద్రౌపదిని గన్నవారు శోకాంబుధిలో మునుంగవలయునుగదా సభికులు. వారు సంతోషముతో చప్పట్లు కొట్టుచు "మరియొకసారి పాడుమనుట, రసాస్వాదనమా! అట్లనిపించునది రసప్రదర్శనమా - మఱియొక్కటి. భీముడు క్రోధముతో నొకపాట పాడి (Action) అభినయము పేర చాల యలజడిజెంది ఆయాసపడుచుండును - పాడలేకపోయినను ఆకీర్తన పాడువఱకు వన్సుమోర్లు చప్పట్లు సాగుచునే యుండును. నిజమైన రసప్రదర్శనమునందీపాట్లు సంభవించునా? ఇంక నెన్నియో గలవు. గ్రంథవిస్తరభీతిచే విరమింపవలసి యున్నది.

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః

శ్రీ హయగ్రీవాయనమః

శ్రీ మహనీయమై వెలసి, చిత్తవికాసము సంఘటించి, చింతామలినత్వముం దులిచి, ధైర్యము దీప్తియు సంతరించి, ప్రజ్ఞా మాధుర్యము, దివ్య కావ్యరచనాసామర్థ్యముం జేర్చి యిష్టామోదంబొనగూర్చి మమ్ములను భాషామైవ మేలుగ సదా.

# సంగీత ఇంద్రసభ

## ప్రథమాంకము

### ఒకటవ రంగము

రంగము - ఆకాశమార్గము - ప్రవేశము అశ్వినీదేవతలు

[ఒకడు ఆంగ్లవైద్యుని వేషముతో నొక చేత గుండెలు పరీక్షించు గొట్టముతో రెండవచేత థర్మామెటర్ అనుగొట్టముతో దొరవలె చెమ్కీకోటు లాగు ధరించి, శిరమున దొరటోపితో నిలచియున్నాడు. రెండవవాడు మందులపోట్లాలుగట్టిన ఎర్రరుమాలు భుజమున తురాయి గల దువ్వాకన్నుచీర తలగుడ్డ చెమ్కీకోటు (ఎర్రనిది) తెల్లనిలాగు నడుమున ముడివేసిన బొంయలు బయటకు వ్రేలుచుండును. మొదటివాడు బూట్లు తొడుగును రెండవవాడు చెమ్కీ-సిప్పర్లు దాల్చును ఇద్దరి ముఖములబొట్టు లేదు గాని గొంగళిపురుగుల విగ్గలుండును] ఇరువురు ముందుకు వచ్చి యిష్టానుసారము చేతిని విసరుచు తలాడించుచు పాడి వెనుకకుబోయి నిలిచియుందురు.]

పాట .. శంకరాభరణ మేళము ఆదితాళము

హాటాహుటిని-సాగరడగించెదం-దృష్టిని కుటిలు-దివిజ - పతిని -కటకట- బడ
స సానిదప -పసనిద పమగమ-రిరి రిగ-మమమ - పపప-దదదని - నిని

నిటలాక్షుఁడేవచ్చి మమ్ము - నిపురుసలుపఁదలఁచి - బెదరించి- విదళించిన-
పదనీ నినిసా స సా స - రిమగరిస నిదపద- పస నీద- పనిదాపద-

చ॥ ముల్లోకములెదురైనను - ముమ్మూర్తులొక్కటైనను - చనుదెంచిరేనియును -
సప్పాపపధపమగరిగ - సగాగ.............. - మగ రిస నిదపదని స-
భయంబునొందుదుమా - సహింతురె సహింతురె -
రి మాగ మాద ద పా - ప సా స దరి రీ -
సదాగతిఁ - విదారింతు
దసాపదా - పసనిదపని

[1 వ అశ్వినుఁడు-ముందుకువచ్చి ఒడలెల్ల తిరిగియబట్టి ఆకసమువంక చూచుచు]

1 అశ్వి- రేరే! శతారధారణ ప్రభూత మనోగర్వసాంద్రా! మహేంద్రా!

2 అశ్వి- (అట్లే ముందుకు వచ్చి కుస్తీబట్టువానివలె నిలచి)
ఓరీ! చతుర్ధశభువనైక పాలనోన్మత్తహృదయ కమలాకరా!
శచీ మనోహరా!

1 అశ్వి- సీ॥ మఱచితివే మమ్ము మహాదోషధీప్రభావజ్ఞుల
ధర్మసాంప్రతుల మూఢ!

2 అశ్వి- పరిభవింతువె లోకవారమ్ము నెదుట సనస్థాలు సో
మపానమునఁ కొంచు

1 అశ్వి- చంపనుంకింతువె సమ్మునీశ్వరుని చ్యవనుని
పరోపకార నయశీలు

2 అశ్వి- వేల్పువెజ్జుల మమ్ము వినుతులగావించి
యేమి యనుభవింతు వెఱుఁగఁ గలవు

1 అశ్వి- గీ॥ నాయకత్వముడిగి నానావిధంబుల
పామరత్వమునకు పాల్పడియెదు

2 అశ్వి- గరువ మెల్ల బాసి గగనవీధుల రోసి
భ్రిష్టుగతినిఁ దిరుగవలసివచ్చు॥

(అని వెనుకకు బోయి, యథాస్థానముల - నిరువురు రంగస్థలమునకు చెరి
రొక ప్రక్కను ఒకరితోనొకరు రహస్యముగ మాటాడుచు నిలతురు)

[నారదుండు పాడుచు ప్రవేశము.]

[తీగెలులేని తాంబూరా, జటగల విగ్గు వృష్ట్వాలు చుట్టుబడియుండును. పంజాబీ సిల్కు షర్టు పచ్చనిది-జపాను సిల్కు ఉత్తరీయము పంచె పైకెలుకట్టు - నడుమున కాశకోక - మెడకు పూసలచేరులు - మెడలో పూలదండ పెద్దది. చిరుమీసములు సన్నని చుక్కబొట్టు - చెవుల కేడు రాళ్లకమ్మలు వ్రేళ్ల మేలురాళ్లయుంగరములు గలిగి యుండును.]

పాట— శంకరాభరణమేళము త్రిశ్రజాతి.

సర్వలోకనాయకా - హరిహరి - సురనుత - గరుడవర-గమన-
గపగరిమగరిపమగరిసా- దసదర - స గ రి ప- నిదపమగ-ని సరి-
శ్రీకరా- శుభగుణా- జలజచరణ-పాపహరణ - పరమపావన- బంధుజీవన-
పదపసా- ప ద ప సి- దిరి సనిదప-దసనిదపమ - గ ప ద ద ద- పదపని ని ని-
మురహర-శ్రీ లోలా-
నిదపమ -గరిసనిదసరీ-
గి రి ధా రీ- సువిచారీ - శంఖచక్రధారీ-సురసుతసుమయచేలా - మోహనా
గరి పా పా-ధపసాసా-సగరిసరిసదదరీసా-ప సనిదసని పమగరిశా - గా ద సా
కృతి- ప రం త ప-
మగరీ- ద ద స రి-

(తాంబూరా మొక ప్రక్కకు నుంచి కొంచెము నిలచి)

నే నదృష్టవంతుఁడను. దైవమును నమ్మి యున్నవాని కిక్కట్టులు శాశ్వతములు గావు. కలహాశనుండనగు నేను పోరులు వెట్టు వెరవులభింపక చిక్కుపడుచుందును; నేఁడో,

గీ॥ కారణము లేక పోరులు గలుగుచుండు, మోహలోభాద్యహంకారములకు జిక్కి
ఉక్కుదక్కజనుల్ తిర్గుచుండుకతన। నాకు సుఖభోజనప్రాప్తి నేఁడు గూడు

(చుట్టు తిరుగుచు)

ఓహో! ఈదీప్తి యెచ్చటిది? నీర్మలనిరద శ్యామలకోమల మైయుఖండ తాండవనంబున దిఙ్మండల మాక్రమించు చున్నది!

సరిసరి. తెలిసినది.

సీ॥ చ్యవనుని వధియింప సమకట్టె నింద్రుండు । మునివరులా వార్తవిని మహోగ్ర ।
కోపస్వభావులై, క్రూరుని దండించియు, పరాభవింపఁగా నూహ యొసగ,
దండధరునిఁజేరి, తగ వాని భటులను, ఇంద్రనాట్యసభకు నేగ బనిచి
అతడు పరాభవించు తెరని శమనుని క్రోధంబు పెంచి యుంద్రిని తదీయ
గీ॥ కోపవహ్నికి శలభంబు రూపముగ నో । వర్చి తమమదిం గలకసిం దీర్చుకొనగ
నెంచి రా కథ తా విజృంభించెఁ బోలు । ధరణీతనయుని దీప్తి గాఁ దలఁతు దీని॥

(దున్నపోతు పై యముని బొమ్మపై నుంచి దిగును.)

కొనిమ్ము. రానిమ్ము. ఈకలహము, విచిత్రపరిణామముగలది యగుం గాక! నాకు నిరుపమాన భోజనసిద్ధి లభించు గాక!

(అని యొకమూల నిలచి యుండును.)

(దూరమున యముడు ప్రవేశము. శిరమున నుంగరములు గా వ్రేలు నిగ్గు. కంఠము నుండి చాలా దూరము వరకు దూగాడు నొక విలువగల సరిగ వస్త్రము (శాబా) చెమ్కీ పని గల పెద్ద నల్లని కోటు. చెమ్కీ మొలపట్టీ పసుపురంగు వేసిన సన్నని గ్లాస్గో పంచె. మేజోళ్లు పైని చెమ్కీ స్లిప్పర్లు. దూరముగా నటునిటు చూచుచు అడుగు లెత్తెత్తి వేయుచు, చేత గదను ధరించి ప్రవేశించుచున్నాఁడు.)

పాట-నటభైరవిమేళం-త్రిపుటతాళం.

మహేంద్రుడింతయొనరించునా! - మము పోరికిం బిలచునా - సహేంద్రతత్క్షణా
రి నీ స రీ రి రి ప మా గ రీ - మమపాదపాపమగరీ- మమామపప్పసా
యయన్నపుడీ - సాహసమేమాయెనో తనగతియపు ఏమి కానున్నదో - పూర్వ
గసదనినిదపా - పానీదపామగరీ మమమగదరిగామపాగమపపా, - పాసనీ
గతియెల్లయుమఱచి॥
దపామగరిరిస ॥

(యేరాగములోనైన బాడవచ్చును)

(షైర్) ధరణీ ధరపక్షచ్ఛేదన శౌండుండు.
జంభాసురప్రాణా పహారణ ప్రవీణుండు
ఇంద్రజన్నిగ సీకృతపాత్రిణనాయి కామానధనుండు
శాపదత్త నిఖిలాంగని మీలిత నేత్రుండు.

(ప్రైతాళం)

వీనినాట్యసభలోనికి - మేము రాగూడదట యిదియేమో వీనికెన్నల గారవము
పాపనీస దపసనిదప - పాపనిదా పమగరి రిమాపా దాదదస సస గరిరిమ
మాకులేదో - వీడెంతవాడో మేమంతవారమే - ఎఎ— — — — —॥
మా గ రీ రీ - సగరి సనిదాపపసనీ దమాగరీ - రిపమగరిసనిస॥

ఔరా ఆనుహోంకారిని మిట్టిపాటు, ఎన్నిమారులు రక్క-
సుల కాళ్ళపిసికెను. ఎన్నిపర్యాయము లపవుల నాశ్రయించెను.
నాభటులు, శవవాహకులట! నేను వారికి నాయకుడనట, ఏవిద్య
యులేక, సద్వృత్తియుఁ గనజాలక మేమూ నీచవిధమున జీవించు
చున్నారమట! అందువలన మేము వారినాట్యసభయం దెందులకు
నక్కరకురామఁట! పెద్దగొంతుకున్నదని భూకరించిన నటుఁడగునా
యని నన్ను ధిక్కరించెనట! నాయెదుటనే యిట్టి సంభాషణ జరిగి
యుండెనేని, (అట్టహాసముతో)

శా॥ మోమున్ జీల్చెద వ్రీడిజేసెద శిరంబుల్ - గేహముల్ దేహము
ద్రావప్రక్రియఁ బుప్పొడిం బొనరుతున్ - దంతాళి
నోటూడ్చి, మా, మామర్యాదల నిల్పుకోక యిటు నిమ్మాడిక్కున్
బరోక్షంబునన్ గొమేవా తలపోయుచు న్నిలతునే-హీనాత్ముడా! ఇంద్రుడా!

(అని గదతో మిగుల కష్టమైన విధమున పౌరుషమభినయించి
ఆయాసమునఁ దూలుచుండఁగా, అశ్వనీదేవతలు నారదుఁడు చెంతఁ
జేరి పట్టుకొనియుందురు. శమనుఁడు కొంతవడి కుత్సాహపూరి
తుఁడై వారికి నమస్కరించును. వారు 'సుఖీభవ' అని అశీర్వదిం
తురు.)

యము—సఖులారా! అశ్వనీదేవతలారా? నారదా! గానవిద్యా
విశారదా! పదునాలుగు లోకముల పారుపత్తె ముండెనుగదా
యను గరువంబున నిందుడ్జిట్టి యుపద్రవకరమైన యహంకార
భూయిష్ఠుండై యున్నాఁడో యెఱుఁగరుగదా!

నారద—ఎఱుంగకేమి. ముల్లోకములును వాని యహంకారనిర్మూలన మాశించియే యున్నవి. ఇందలి రహస్యంబులు కొన్ని నే నవ్వల యెఱింగించెదను. ముందు కర్తవ్యమవలోకించి దదాచరణోన్ముఖులై ప్రవర్తిల్లుము. మరియు నీకార్యావసరమువలన నేపాప మొనరింపవలసి వచ్చినను మనము వెనుదీయరాదు. వినుండు.

సీ॥ ముందుగ నశ్వినుల్ పోయి మహేంద్రునితో, రాక్షసులు వేయి, నూరుచుంది।
సురరాజ్యము హరింప, వరముల గాంచి రాత్రపము లొనర్పంగా దర్దం జనుచు।
నున్నారు, వారల యున్నతి యోడపక, సురల కెంకగృహంబు నరక మార్య!
శుక్రు నర్థించి యా, వక్రపద్ధతి వేగ నరలించు టిప్పుడు మనకు మేలు,
గీ॥ గరుపము సహించి రాక్షస గురుప టంచు,
వాని నిరసింతు వేని నే నందలేండ్లు
పందలమయి తిరుగుచుండ వలసి వచ్చు
మంచి చెడ్డల నీవే యోచించుకొనుము

అని దీనవదనులయి యా యశ్వినీదేవతలు, ఇంద్రునిమ్రోల మొరయిడిన, సతండు భయంబున శుక్రు నాశ్రయించి, వానికి సర్వాధికారంబొసంగు. అప్పుడింద్రలోక గౌరవంబు మనము కేడు పఱువ వచ్చును.

అశ్వి—మే మిప్పుడ పోయి మీ యాజ్ఞ నెరవేర్చి వత్తుము.

(నిష్క్రమింతురు చేరి యొక వంకకు,

నార—మన మిసుపురము విశ్వామిత్రునాశ్రమమునకు జేరుదము, (భజగోవిందం పాడును

తెరజారును)

2 వ రంగము—విష్కంభము.

[ఇంద్రుని కొడుకు జయంతుఁడు ప్రవేశము. కాప్పంగు గలతల. ముఖమునఁ జందనపు బొట్టు. తెల్లగా సుద్దముద్ద వలె పూయబడిన ముఖము ముందు వైపునంగు జెవులకిరింగనుండి మెడవెనుక భాగమున గంగుతేదు పాతచెమ్కి జోడు. పూస లూడిపోయిన లాగు. చిరిగిన మేజోళ్ళు. ఈతని వెంబడి శుక్రాచార్యులు. ఒకకన్ను

చేతితో మూసి యుంచి. చిన్న నల్లని గడ్డముమీసము కాషాయపు తలగుడ్డ అంగరకా, పంచె చేత యోగదండము]

శుక్ర—జయంతకుమారా. ఏదీ నీ తండ్రి పంపిన సందేశము? మఱియొక్కసారి వినిపింపుము,

జయంత— ఆచార్యవరేణ్యా. సుగుణగణాఢ్యా, ఆలకింపుము.

సీ॥ మునిచంద్ర దనుజు లెట్లనుకూలురో మీకు । దేవతలట్లు విధేయులనుము ।
ఆచార్యుఁ డొకఁడని యున్నాదరించినభంగి మమ్ముల దయఁ జూచి మనుచుమనుము।
మాగురువులకంటె మహితవృత్తిని మిమ్ము ననుసరించెదము సత్యంబ యనుము।
అవసరంబయిన మా యాచార్యు విడనాడి గురువుగా మిమ్మె గైకొందు మనుము।
గీ॥ ఎంత కాలము కూర్మి మాయెడల నమరు ।
గలుగు నంతకాలమును భృత్యుల మె యనుము ।
దనుజులు తపంబునకు బోవ తలఁపు మాని ।
నిలచు నటు జేసి మము భువి నిలుపు మనుము॥

శుక్ర—జయంతా! ఇందు కింతగా నన్నర్థింప వలయునా. ప్రత్యుత్తర మిచ్చి నిన్ను పంపెద నుండుము.

(స్వగతము) (దూరముగ నిల్చి) ఓహో నారదుఁడు నన్ను కృతార్థుని గావించినాడు. రాక్షసుల తపోనియమము నడ్డగించు నెపంబున నే నినింద్రునకు పరమోపకారి నైతిని. అనృతకల్పనమన్న నిట్లుండ వలయు. ఇప్పుడు నేను సురాసురాచార్యుండనై లోకంబుల నెల్ల విరాజిల్లం గల వాఁడను.

ఉ॥ నూతనశాస్త్రవైఖరులు, నూతనధర్మ విధానముల్, కడున్ ।
నూతనతత్త్వముల్ మఱియు నూత్నకవిత్వ కళాప్రచారముల్ ।
ద్యోతితముం బొనర్చెద సనూనపురాతన రమ్యపద్ధతుల్,
పాఁతఱలందు పూడ్చెద ప్రపంచము వానిని చూడకుండఁగన్॥

అప్పుడుగదా నేసంకల్పసిద్ధుఁడను. కానిమ్ము. (ప్రకాశముగా) జయంతా! ఇటు రమ్ము. నా ప్రత్యుత్తరము ఇదిగో యీ కాయితము నందు గలదు, నీ తండ్రికిమ్ము. అం దేమి గలదో నీకును విన్పించెదను వినుము,

సీ॥ హీనగతుల నన్ను నిట్లు లర్ధించుట తనయంత వానికి తగని పనుము ।
దనుజుల ఘూనిక తప్పక మాన్పించి దివిజులమేలు సాధింతు ననుము ।
ఇంద్రుని కే నింక నేమిమేలొనరింప వలెనన్న గావించు వాడ ననుము ।
మనమిర్వురము నొక్కమాటమీద నిలచి అఖిలంబు సాధింత మంటి ననుము ।
ఆ॥ వె॥ గతమునాస్తి ముందు కాలము మనయది
యంట నురువతూడ దంటి ననుము
కొత్త పద్ధతులకు చిత్తమ్ము రుచిగొల్పి
కీర్తి యెంతయేని గూర్తు ననుము

ఇంక నీ వరుగుము.

జయంత—చిత్తము- (అని వెనుకకు దిరిగి నిష్క్రమించును.)

శుక్రుడు—(సంతోషముతో) రాక్షసగురువు నేను లోకములకెల్లగురు వగుట విచిత్రముగదా- బళిరా! నాయదృష్టము దురవగాహము- తొల్లి విష్ణువు వామనావతారమెత్తి నన్నేకాక్షు నొనరించెనని చెప్పుకొందురు. (మూసిన కను దెఱచి) నిక్షేపమువలె నున్నకన్ను పోయినదని కన్నులుపోయిన వారన వలయుగాక! ఇంక ముందు శుక్రాచార్యుడన్న నేకనేత్రుడని యర్థము కాకుండుం గాక! నాటకములయం దెవ్వడు నా వేషము ధరించినను రెండుకన్నులుం దెఱచియే చూచుచుందురు గాక!

[తెర జారుచుండగా నిష్క్రమించును.]

## మూడవ రంగము విశ్వామిత్రాశ్రమము.

[విశ్వామిత్రుడు తపస్సు చేయుచు కూర్చుండును. శిరముపై యెత్తుగా చుట్టబడిన జడలు, తలనుండి పాదములవరకు దూగాడు జడలు కొన్ని. నల్లని పెద్ద మీసములు గడ్డము స్ఫటికంపు చేరులు, మెడలోను జడలకును; పచ్చని పట్టు అంగరక్షా, పంచె నిగనిగ లాడు చుండెను. యోగదండము పై నొకచేయి, జపమాల త్రిప్పుచు నొక చేయి. చేతి మురుగులు బయల్పడుచు డాగుచు నుండును. కన్నులు మూయుచు తెరచుచుండును.] [దూరమున శిష్యులు, నక్షత్రకుడు, ప్రలాపకుడు-వంచకుడు-మందుడు నురికొందరు చాక్యాలు లాగులవారు త్రాపింగులవారు కాయితములు పట్టుకొని కూర్చుందురు.)

ప్రలా॥ నక్షత్రకుండా యీపాట విన్నావటోయీ అయితే పాట కాదులే పద్యం.

గేదె తోకకు చివర తాడొకటి కట్టి
దాని చిగురునను తాటాకు ముడి బెట్టి
తాటాకు కొనకు నిమ్మగ నిప్పు బెట్టి
ఎగరవోయీ బాలుఁడా
గేదె నటు......తోలవోయీ బాలుఁడా
వెను వెంట......తిరుగవోయీ బాలుఁడా

వంచ—మా అమ్మ నాకిట్లాంటి పాటొకటి చెప్పింది.
నక్ష—ఏదీ పాడూ
వంచ—నాకు రాదు; నే మఱచే పోయా,(తాటాకు బూరా ఊదును)
నక్ష—నీ కొకటి వొచ్చింది గనక యిది రా లేదని చింతా?
వంచ—ఊ బళ్ళో అంతా అంతేగా కాకపోతే,
పంతులు చూస్తూనే వున్నారు. వొచ్చి పాఠా లప్పగించుకొని కొత్తయి చెప్పరేం కారణం.

విశ్వా—[కోపముతో గప్పున లేచి పావలపై రెండడుగులు నడచి, పదర సాగక విడిచి వడిగా వచ్చి, దండము సారించి]

పాట-శంకరాభరణ మేళం-మిశ్ర-త్రిపుట

ఓరోరిధూర్తుడా-కలుషచిత్తుడా-రీ-గార వాదినరకముం బొందుగా జడుడా
పానీని పని నిపా నిద నిపని నిసా సా సని నిదాప పమరిగా రిరి ధసా మమరీ
ఖలుడా దుశ్శీలుడా-దుర్మదాంధుఁడా నన్ను నిందించదవేరా!
మమరీ గరిమాగరీ-గమ్మ గమ గరీ సారి నిద పమగరి రిని సా

ఓరీ! ఎవడురా నా యెడ నపరాధము గావించిన వక్రబుద్ధి? వాడు నా పరాక్రమమెల్ల విస్మరించెను గాబోలు, అయిన నిదిగో వినుండు, మఱొక్క సారి నొక్క వక్కాణించెదను.

సీ॥ నవనాకనిర్మాణనైపుణి యొసఁగంగ బరఁగ త్రిశంకుఁ గాపాడె నెవఁడు
సృష్టి గావించు నూర్జితశక్తి యార్జించి రెండవ బ్రహ్మయైయుండె నెవఁడు
తకర వశిష్ఠ సంతాన కాంతారంబు దహించి జృంభించు ధన్యుఁ డెవఁడు
అల హరిశ్చంద్రు నుద్యత్సత్యశీలంబు నవనికిం దెల్పిన యనఘుఁ డెవఁడు,

గీ॥ అట్టి గాధేయు నెదుట ధైర్యంబు గలిగి
వాని నిందించు పంద యెవండొ నేడు,
ప్రాభవతరమగు మచ్ఛాపవహ్ని యందు
నిర్దహించక పోవడే నిముసమందు.

(అని యట్టహాసము సేయ నంతలో శిష్యులెల్లరు. వాడు వాడని యొకరి నొకరు చూపుచు పారిపోవుదురు నక్షత్రకుడు మాత్రముండును విశ్వామిత్రుడు మరల తపము చేయుచుండును.)

(అప్పుడు యముడు, నారదుడును పూర్వోక్త వేషంబులతో ప్రవేశించు చున్నారు ఇర్వురు అంజలి ఘటించి గాధేయు ప్రార్థించు చున్నారు)

పాట-ఖరహరప్రియ-ఆదితాళం(పల్లవి యక్షరము త్రోసి పాడవలయును)

శరణు గాధినందనా- మునిబృందారకేశ్వరా- సర్వలోకనుత సదానంద-చిదానంద
పమపగమగసరినిసా-నినిసారీమదాపమపా- పదమాగరిస ససాగారి. రరీగానమా
రూప సచ్చిదానందస్వభావ దురావ - ముదావహంబుగ మాకునీదు - దర్శన
పా న్న సా సా స స నీ ద ద నీ ప స సా స రీ రి రి గ సా రి - గ రి స
మిచ్చి బ్రోవవే - కావవే - లెమ్మ
నీ ని దా ని సా - గాగమా- గసరి (షైర్)
అఅఅఅఅఅనీయంతరంగంబు బాడగ నిపెట్టివారము-
స స రి రి మ మ ని......ని పాపపదనినీసా......
నీతో నవరమైనపనియుండి వచ్చినారము నెయ్యమారనినునిచ్చోట నేగన్నవారము
నీనీద...................పద పమా...సమ............రిగరి......సా....
ఊ ఊ ఊ -
గా రీ సా -

(తాళం)

దానులము- ఘనదోషులము- ధృత- వేషులము - నిను - భానురమతిం దలచు
నిససపసని - నిదసనినినినిద - దప - పదదదదప - పమ - దరిరిసస ని ద ని ద
చుండువారము - అ.......................
పమపగామ రి - సరిగమపమధపసనిదపమగ మ రి-

నారద—సకలభువనభయంకర తపోనిరాటంక ప్రభావుండ వగు నీవు మమ్మును గ్రహింపుము.

యమ—చతుర్దశజగజ్జేగీయమానానూనోజ్జ్వల తపోదీప్తి సంపన్నా! మము దయాదృష్టుల నీక్షింపుము. నిర్వ్యాజాపారకరుణారసప్రపన్నశరణాకరణైకదక్షుండవై కన్నులు తెఱచి మమ్ము రక్షింపుము.

శా॥ నీకుం బ్రహ్మకభేద మెయ్యెడల వాణీనాథునుస్ నీవు ని
ర్లేకంబైన జగంబు నిల్వ దికఁ బ్రత్యేకంబుగా నుండి పో
టీకక్షల్ వహియించి సృష్టిప్రతిసృష్టిన్ సల్పఁగాఁబోలు, నీ
వీకన్ నీడకు మానిసత్తమ మమున్ వీక్షింపుమా ప్రేముడిన్॥

విశ్వా—(కన్నులు దెరచి పులకరించుచు) నారదా! వీణాగానవిశారదా, శమన, సకలలోకపాపసంఘదుర్గమనా. మీ కోరిక నేనెఱింగితిని. ప్రయత్నమెల్ల గ్రహించితి. నిరుద్ధపదాబ్జరాక్షసేంద్రుండగు నీ బృందారకేంద్రుడు శిక్షాపాత్రుండు. వానిని మరొకవిధమున వంచించుటకాదు. వాని నాట్యసభాగారవము పాడువడిన, వాడన్నివిధముల నాశమందును. తత్సభావృత్తాంత మాలకింపుడు.

ఉ॥ నాట్యకళాభిమానమును నాట్యకుతూహల మున్న యంతనే,
నాట్యకళాప్రసిద్ధి యగునా? తగురీతిని వృద్ధిగోర కా
పట్యము లేక తత్కళలభావ మెఱింగి జరించకున్న నా
నాట్యమె గూర్చు వేగతుల నాశము దాని స్మరించువారికిన్॥

మీరింతవరకు నొనరించిన యత్నము సార్థకమైనదే. నేనిప్పుడపూర్వసృష్టి రచనాసామర్థ్యము నూతముచేసికొని,

ఉ॥ నూత్నవటావళిన్, గడు వినూత్నకవిత్వ పటుత్వశీలురన్
నూత్నకళాప్రవర్తకుల, నూతనభావగసప్రసిద్ధులన్
నూత్నవిధానతత్పరుల, నూరుల వేల సృజించువాఁడ, నా
యత్నము మాను డింక నని యుత్సుకవృత్తి మునీంద్రులారు పొంగఁగన్

మీరింక నిశ్చింతతో నుండుఁడు. మన పక్షమువారలనేక దీక్షతో పని సేయుచుండ నియమింపుడు. పోఁడు.

నార - యమ - (సంతోషముతో తాంబూరాగదల ద్రిప్పుచు)

పాట - యిష్టారాగముతో పాడుచున్నారు

ధన్యులమైతిమి మేమింక - మాకు నేమిటి కొరంత - గోరంత
అన్యులు మాయెదుట నిలతురే - కడలనడపమా - గడపమా.

(నిష్క్రమింతురు)

విశ్వా—శిష్యా నక్షత్రకా. నీవు నాయెడ విశ్వాసముగలవాఁడవు. కావున,

గీ॥ అల హరిశ్చంద్రుఁ బీడించి నట్టినీవు
నేడు దేవేంద్రుఁ బీడించి గాదుపఱచి
వన్నె గాంతువు శుక్రుని భక్తిగొలచి
అతడు చెప్పెడు నదియెల్ల నాచరించు॥

నక్ష—చిత్తమిప్పుడపోయెద. నిష్క్రమించుచున్నాడు. (అని వెళ్లును)

విశ్వా—(వహ్ని యెదుట గూర్చుండి హోమము సేయుచు) ఆగచ్ఛ ఆగచ్ఛ ఇత ఆగచ్ఛ నూత్నగాన విద్యావివేకసంపన్నా — భూర్భువస్సువర్లోక జేగీయమానానూన దీక్షావైభవ శీలా! ఇచ్ఛావిహార సమాహితసంపూత చరితా! ఆగచ్ఛ ఆగచ్ఛ
(అప్పుడొక పురుషు డుద్భవించు చున్నాఁడు)

పొడుగుగను, సన్నగను, నల్లగను, చిక్కినఅవయవములు గల వాడు తెల్లని యుడుపులు ధరించి పూసలు ఉన్నితో సమర్చబడిన హారములతో కొలఁది వెండ్రుకలు గలవాఁడు)

పాట - కళ్యాణి - ఆది

ఏలా సృజియించితివో - నన్నేలా సృజియించితివో ఏకార్యము నే సేయవల
పాదపమపాగగరిరిగసా- నీసరిగమ ... ... ...... గరిగాగగపా ... ...
యునో - ఏకరణిన్ మెలంగవలెనో దెలుపు ॥ఏ॥
...సా - రి స స సా స నీ ద పదపగరిగ

నీయాన నిరపాయకరముగా - నిరుపద్రవముగా నెనెరవేర్తున్ - శీఘ్రయుతుండ
సా నిదపపదనీ నిసారిరీ - రిగపమ్మగగరీ రిరిగసాసా - సరిపగాగ
నయ్యెదన్ - కీర్తిన్ గాంతున్ - కడున్ గడున్ జృంభించెదను.
గగదపా - గపమా గాపరీ - గదా మదా మా గారిరిస॥

విశ్వా—ఓయీ నిన్ను జనులు గానధునీ! యని పిలచెదరు గాక! నీ కర్తవ్య మేమందువా.

గీ॥ పూర్వసంగీతపద్ధతి బో నడించి,
ఆర్థభావరసాదుల నవల పెట్టి
కృతులు రచియించు నాటక ప్రతతి గూడ
నీవు విరచించి తత్కాల నీవ యేలు ॥

గీ॥ బుద్ధికిం దోచినట్టుల బొలుపు మీర
నాట్యవిద్యకు పద్ధతుల్ నడప వలయు
ఒక్క డౌనన్న దానినీ వొక్కపుడును
మెచ్చి యాతోవ పనకుము మేలు కాదు ॥

గీ॥ రసమునకు భావమునకు నర్థమ్మునకును
నూర్పకుము రాగముల ననుకూలగతుల
భరతు నభినయశాస్త్రంపు పద్ధతులకు
తావొసంగకు రవ్వయంతయును మదిని ॥

ఆ॥వె॥ ఇందు నాశ్రయించి సాంద్రకీర్తి గడించి
వాని నాట్యగౌరవంబు దెలిచి,
సకలభోగములను చక్క ననుభవించి
వర్ధిలెదు త్రిశంకు స్వర్గమందు

ఇంకఁ బొమ్ము.

గానధునీ!—— తండ్రీ ఇక శెలవు (నిష్క్ర-

విశ్వా—(తిరిగి హోమము వేల్చుచు)

సృజ్యతాం। సృజ్యతాం। శుభాంగీ, కించిదంచిత సౌభాగ్య సుందరీ! మదురగాత్రస్వరధోరేయీ, సామాన్యశరీర ధర్మవిలాసినీ-మ్మాయాదేవీవర్ణ సౌదామినీ- కపట స్వభావభాసుర ప్రవర్తినీ-ఇత- ఆగచ్ఛ ఆగచ్ఛ——(అప్పుడొక స్త్రీ పెద్దపెద్దజకీపువ్వులుగల బ

నారను చీరధరించి చెమ్కీపనిగల మెరుగుకుట్టురవిక చివరకుచ్చులు గల దానిని ధరించి, శిరముపై తురాయి, అందువెల్లెక్కిక్కదీపము విలువగలనగలు శరీరమెల్లదాల్చి బంగరు పతకముల మొలతాడు మతో వచ్చును)

పాట—హనుమత్తోడి మేళం.

జనకా................ఇదెం..........దనముా నను నిటు సృజియించితి
పనిపానిసానిపనిసా.మప..మాపనీపమాపమపా.గమగసా .మపమ గమపని పమ
వేమికతమో దనగ ఇగమున నే నిటు ప్రవర్తింపవలయునో త్రిశ॥ కనికర
పమగసగమా. పని సని నని పమ పాప మపనీ నిస పని నిసా॥ మ...
మున వేగమ దెలుపనగుగా చనవునతో బలమునవో, చనినీయానల నెరవేర్తుగా
మాగస...సగ గమపా. పససససాని పపపపామ సనినిపపమ మగసగమాపా
సంత సంబు నీ కొనగూర్తుగా అ..................జనకా॥
సనిప సనిపపమ పమ మగసా సగగమగపపనిసనిపమగపనిపా॥

వ్యా—సుందరీ, నిన్ను నే నొక కార్యార్థమై సృజించితి నిటు వినుము.

సీ॥ అనవద్యహృద్యగానాయత్తమై నీదు కీర్తి లోకంబుల మూర్తిగాంచు
సామాన్య సౌందర్య సందీప్తమై నీదుమూర్తి జగంబునఁ గీర్తిదాల్చు
అల్పవిద్యాపరిసంగాప్రతమై నీదు బుద్ధి జనంబుల సిద్ధి పొందు
కలుషస్వభావసంఘటితమా నీసిర, సిద్ధినెనఁగు యీ సుబుద్ధిఁ బొనఁగు॥

గీ॥ నిన్ను గాంచిన వారలు నిన్ను విడరు
విడచినను నీవు విడువవు కడిమివారి
వైభవము లంతమందెడు వరకు, వారి;
నీవు నిరుపమానవు ధరణీస్థలమున॥

ఇంద్రుని నాట్యరంగము నందు ముఖ్యరాలవుగానుండ సృష్టించితి. కాని నాకొక్క కోరిక పుట్టుచున్నది. అదియేమందువా,

శా॥ పెక్కండ్లాయెను భార్యనే విడచి తిన్వీ శాసి నృత్యర్థమై,
మ్రుక్కంజూచితి గాదె నాతమవు మేలుంగీకు యోచించి నా
దిక్కై కాపము బాపి కీర్తిగనవే దీవుండ నర్థించితిన్
నిక్కంబే నిను నెంత జేసెద నో బోణీ నీవే వీక్షింతువే॥

కోటి సంవత్సరములనుండి నే గావించిన తపస్సువలన పుట్టిన వేడి యింతింతన రాదు. దానిందీర్చి పున్నెము కట్టుకొమ్మా కొమ్మా॥ నీపేరు రాగరత్నమని జనులు మిక్కిలి కొనియాడుదురుగాక!

రాగరత్న - పాట - జంఝూటి - రూపకం

ఇటులనదగునా - పటుతరముగ పామరులటు భోగమాసించెదు భూపతివో -
మపగమరిగసా - నిదపమ మపపామగరిస మాగరీ సాసస - రీగగమా -
త్యాగమోటుగని దనిమడవో.
సనిదపమగ గగమమపా

విశ్వా-పూవుబోడివిను - భూపతి నేయేను - నిలువంజాల - వే - యేలవే
దదరి రిరిరి - నిని సససస - దరిసాపని దా మగసా

రాగ-జనములు విని యెదరనియే సంశయించెదన్ - జనకా సంశయించెదన్ - నను
సానీసస...నిని దపమపమ పపమగరిగామపా- నిదనిదపమగరిగమపా - నిద
నిక-విడువగోరెదన్ - మనవిని - వినన్ వేడెదన్॥
నిదపమగ - పమగరిగమపా - నిదనిద పమగరిగమపా।

విశ్వా-నినునిక విడువంజాలను - విడచి బదుకజాలనే - నాతమిదీర్పంగదవే?
నిసనిదదపపమ మగమగ - సనినిదదపమగగమా - పదమపగమరిగసా॥

రాగ-ఓ......దయామయా - యిటులనదగునా
సరిమప - పనీపనీ - మపగమరిగసా॥

రాగ—దేవా, గాధినందనా! నే నితరోద్దేశము గలిగి మీ కెదురాడుచుంటి నని తలంపకుడు.

క॥ మునినాథ నాదు కూటమి
ఘనతరముగ మీకు చేటు గల్గించును గా
వున వలదంటిని, యటుకా
దనినన్ మీ యాన శిరము నందున దాల్తున్॥

విశ్వా—అయిన గమ్ము. అనంతర కరణీయ మన్వాల యుపదేశించెదను. (నిష్క్రమించును)

## 4వ రంగము. విష్కంభము.

[ఒకచెట్టుక్రింద విశ్వామిత్రుడు. మునివేషము విడచి బనియను దొడిగి తువాలు చేత బట్టి. లుంగీజుట్టి ప్రవేశించును]

సీ॥ సృష్టించినాఁడ విచిత్రలోకములను నవనాట్యగతుల కున్నతి యొసంగఁ ।
పుట్టించినాఁడను మూర్ఖుల విద్యావివేకసంపదలకు వేర్పరువుల ।
కల్పించితినినూత్నకవితావధానతత్పరులను నూత్న నాట్యరుచిఘనులఁ ।
పెంచినాఁడను గానవిద్యల ప్రాతమార్గములు దొక్కని దీక్ష గలుగు వారి ॥

గీ॥ దేవరాజసభాదీప్తి దిగియనెంచి
కాని యీ రాగరత్నము కతన నేను
మున్ను చెడి యిట్టు లుంటిని మునిత పాసి ।
అయిననేమి నావృత్తికి యంత మున్నె ?

శబాస్ దివ్యదృష్టి మాత్ర మంతరింపలేదు. ఓహో సమస్తము తెలియ వచ్చుచున్నది. దేవగురుఁడు బృహస్పతి శుక్రుని వలన తరుమం బడియె. భరతమునిని పిలచువారే లేక పోవు చున్నారు. దేవనాట్యసభ కళ్వాసీ దేవతలు సర్వాధికారులు. శమనుడు శుక్రశిష్యుడైన నక్షత్రకుడు ప్రధానపాత్రధారులు. గానధుని ప్రధానోపాధ్యాయుడు. రాక్షసులు, యమభటులును గదా ముఖ్యవేష ధారులు. బాగు! బాగు! సంకల్పమిట్లు నెరవేరవలె; పూర్వనట ప్రతతి యెల్ల వెడలి పోయెగదా. ఇంద్రుడీక శుక్రుని చేతి కీలు బొమ్మ. నన్నిగతికి దెచ్చిన రాగరత్న మింద్రు నెంత యైన చేయఁ గలదు. ఓరీ యింద్రా మత్తద్వేపేంద్రా. (మేనువడకించును)

శా॥ లోకాధీశుడనంచుఁ బొంగితివి లోలో నీ యహంకారము
స్తోకంబా నవకారమే నలువు నీ ధూర్తత్వముల్ సెల్లునే ?
సాకల్యంబుగ నిన్నడంచి నిను నీచత్వంబు పాల్సేయురా!
నీకు న్నిప్రజకేమి సౌఖ్య మగు రానీ చాత్మ యూహింపరా ॥

(నకారపూర్ణానుస్వారములన్నిటిని లకారములుగా నుచ్చరించును)

(నిష్క్రమించును)

# సంగీత ఇంద్రసభ

## ద్వితీయాంకము

(ప్రబోధకుఁడను బాలకుఁడు సిల్కుపట్టు, నెక్టైలు మొదలగువాటిని ధరించి ప్రవేశించుచున్నాఁడు)

చదువేకష్టము. దానికంటె స్వరము మొదలగు వానితో వేదములు చదువుట మరింత కష్టము. వేదమునకు బ్రహ్మ స్వరమేల ప్రాధాన్యముగా పెట్టవలె? అందువలననే వేదము గీదము నేర్వఁజాలనని, తలిదండ్రులకైన జెప్పకుండ పారిపోవుచున్నాను. బ్రహ్మదేవుఁడు చెప్పినట్లు నా గాత్రమున వేదస్వరము కంటె చక్కగా సంగీత స్వరము పలుకును కావున నేను దానిని పురస్కరించుకొని లోకమునఁ బ్రఖ్యాతి గాంచెదను. ఏదేని యొక శ్లోకము పాడెద నెట్లుండునో. (యోచించి) చదివిన శ్లోకము లన్నియు నప్పుడే మఱచిపోయినాను. పోనీ తెన్గుపద్యమైనఁ జదివెద.

మ॥ సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం - జేదోయి సంధింపఁడే
పరివారంబును జీరఁడ భ్రగపతిం - బన్నింపఁడా కం
తరధమ్మిల్లము; చక్కనొక్కఁడ, ఖగప్రాణావనోత్సాహియై॥

(తెరలో) నారాయణ నీపదసేవఁకుపఁ నారాయణ (అని పాట

ప్రబో—(అటుచూచి) మఱొక్కఁడు నా బోటి వాఁడే పాడుచు వచ్చుచున్నాఁడు.

(అంతనొకఁడు రభ్రుఁడను వాఁడు ప్రవేశించును)

[రెండు చిరతలువాయించుచు ప్రాతచొక్క తొడిగి ప్రాతపంచె సగముకట్టి, సగము జోళెగా జుట్టి పాడుచున్నాఁడు]

పాట—మాయామాళవ గౌళమేళం చతురస్రి

సారసదళలోచన - శౌరీ - ఇఇఇఇ ఇఇఇ
సానిసదనిదదసప - రిగసా-రిగపదగపద
చారువనమాలికా - ఇభూసితవత్సా పాండవపక్షా
గాపమపదాదదా - దసానిదససా సమగరిగగరీ
దనుజవిపక్షా - అఅఅ - - - -
సనిదగమదాని- దదపగ - - - -

ప్రబో—ఓహో యీకీర్తన కీర్తనియమై యున్నయది. ఓయీ నీపేరేమి?

ఉరభ్ర—నా పేరు నీ కెందుకు? సంబంధము చేయుదువా?
ప్రబో—ఏమో భవిష్యత్తెవరు చెప్పగలరు? పేరు చెప్పతప్పు లేదులే
ఉరభ్ర—నేను బిచ్చగాడను ఉరభ్రుడను పేరువిని యేమిచ్చెదవు?
ప్రబో—నేను క్రొత్తగుడ్డల బిచ్చగాడను. నీవు పాతగుడ్డల బిచ్చగాడవు. నేనేమి యిచ్చెదను?

ఉరభ్ర—అయిన నెందు బోయెదవు?
ప్రబో—నేను నీవలె కొంచము పూర్వకాలపు సంగీతము పాడగలను. దాని వలన జీవించుటకు నావకాశ ముండునేమో యని పోవుచున్నాను.

ఉరభ్ర—నిజమే. నీవన్నట్లు భవిష్యత్తెవరు చెప్ప గలరు. మన మిద్దరము బాటసారుల యాచించి చక్క జీవించ వచ్చును. నీ వెక్కడ నుంచి వచ్చు చున్నావు?

ప్రబో—చదువ జాలక పారిపోయి వచ్చుచున్నాను.
ఉరభ్ర—నాకంటె నీవే మేలు. కొంత వరకు చదువు కొన్నావు.
ప్రబో—ఆ! చూచి కొంతవరకు పుస్తకము చదువగలను. నీ కదియు రాదా.
ఉరభ్ర—నా కదియు రాదు. పొట్టపొడిచినా అక్షరమిల్లె.

ప్రభో—అయిన నీవు డొక క్రొత్తరకపు కీర్తన పాడితివే అదెక్కడిది?

ఉరభ్ర—ఈమధ్య నీ విధమైన కీర్తనలు చాలా బయల్దేరినవి. మీరు వినలేదా?

ప్రభో—విన లేదు సుమీ. ఎవరోవచ్చుచున్నారు! (అని తొంగి చూచుచున్నాడు. నారదుడు ప్రవేశము.)

మోహన ఆది.

దేవదేవసర్వలోకేశ్వరా - శ్రీవరాసురవరాదిగానుత - నమోనమో-నమోస్తుతే॥
పదపపదపసదప పదసా సా-సరిగసా సదపదాదసదసా-దరీదసా పదాదపా॥

(నారదుడు రాగనే యిరువురు నమస్కరింతురు నారదుండు దీవించును.)

నార—బాలకులారా మీ నిజవృత్తాంత మెల్ల నే గ్రహించితిని నీకు చదువురాదు. నీకు చదువవచ్చును కాని మీరిరువురును పాడగలరు. ఇరువురును ముష్టియెత్తి యైన జీవింతమని తలంచు చున్నారు. నిప్పు మున్నే యందుల కలవాటు పడియున్నావు. పోనిమ్మ. ప్రస్తుతాంశమేమనగా.

మ॥ చదువుల్ సంధ్యలు లేక యుండినను నైశ్వర్యంబు వాటించు న
ట్టిది యొందున్నది నూత్న నాట్యకళ దృష్టిం దానిపై ద్రిప్పి మీ
రుసరోత్సాహము తోడ నుండుడు సుఖోద్యోగంబు ప్రాప్తించుగన్

ఇరువురు:—ప్రభో!

ఎదియో మాకు తెలుంగు చెప్ప గదవే హే సంయమీంద్రాగ్రిణీ ॥

నారద—ఇంద్ర నాట్యసభ నేడు కొందరు యమభటులకును రాక్షసులకును స్వాధీనమైనది. మఱియు విశ్వామిత్ర సృష్టివలన బుట్టిన కొందర రందధికారులు. శుక్రుడు గురువు. పూర్వనాట్యపద్ధతి యెల్ల మారి పోయినది. మీరందేగిన,

ఇద్దరు—ఓయి దేవుడా! రాక్షస యమకింకరుల మధ్య మేము బ్రదుకదరమా.

నారద—భయపడకుడు. వా రెల్లరు విప్పుడు వారి వారి వృత్తులను మాని, నటులైనారు. మీ రందేగిన వేషములు వేయుచు నిష్టోపభోగము లనుభవింపవచ్చును.

ఇద్దరు—నాటకమన్న నేమో తెలియదే. మే మెట్లక్కరకు రా గలము.

ప్రభో—ఆర్యా

మ॥ సరిచూడం, గన మర్ధభావరసభాషాజ్ఞాన సంపత్తి యీ
వరకు న్యాసము వేయలేదొ కటియుక్ పద్యంబులుఁ బాటలు
స్ఫురదోషోజ్జ్వలవృత్తిఁ బాడెదము మీతో డిం దబద్ధంబులే
దరయఁ, మా కట సాగివచ్చునొకొ ఆర్యా! భీతి యయ్యెం జుడీ ॥

నార—మీరు చాల పిరికి వారు. మిముబోటి వా రెంద రందు లేరు వా రింద్రసమానభోగులై యుండ లేదా? అశ్వినీ దేవతలమాట యెవ్వరును జవదాటరు. వా రందు సర్వవిధ స్వతంత్రులు. ఆ కారణమున నందు జేరు వారి కే రోగభయమును లేదు. శ మనుడు సర్వాధికారి. కావున పాపభీతి తో పని లేదు. సురు డాచార్యుడు. రాక్షసభీతి యొదవదు, మఱియు నా నాట్యసభ యందు

సీ॥ చదువు పాటింప రచ్చట లేశమేనియుఁ, గానమే మిగుల ప్రధాన మగుట।
జ్ఞానసంపదల కచ్చట తావు దొరకదు గానమే మిగుల ప్రధాన మగుట।
అభినయజ్ఞానముం దణుమాత్ర మెక్కుడు గానమే మిగుల ప్రధాన మగుట।
మాన మర్యాదల మాట విన్పింపదు గానమే మిగుల ప్రధాన మగుట॥

గీ॥ భయము విడిగి పొందు మిము బోటి వారలందు
చక్రవర్తులకంటె నుచ్చమగు రీతి
మనగ వచ్చును భోగంబు లనుభవింప
వచ్చు; మేలగు ముష్టిజీవనము కంటె॥

ఇంకను మీ సందేహములు తీరలేదా?

ఇద్దరు—తీరకేమి స్వామీ, ఇదిగో మీ వెనువెంటనే వచ్చుచున్నా రము మీరే మమ్మందు ప్రవేశపెట్టుడు.

నార—అవశ్యము మన్నించవలెను. పోవుదము మఱియు నొక్క విశేష ముండుగూడ గమనించుడు.

క॥ పండితులకు, సర్వసుగుణ
మండితులకు, కొదువ లేదు మతి యుచ్చాటన్
జెండియు శుక్రాదుల యెడ
నింకారదు భక్తియందు నెరపన్ వలయున్॥

క॥ శుక్రాదులయెడకంటె శ
త్రువులు నెడ భక్తి లేమి తప్పనరు సుమీ
శత్రు నకుం దగు గౌరవ
మే క్రమముననైన జాలు నిచ్చిన, వింటే,

రంగము యింకా బోవుదము (నిష్క్రమించుదురు)

## రెండవ రంగము

(సత్పుత్రుండు కాకితము కలము సిరాబుడ్డియు దాపున నునిచికొని కూర్చుండి యున్నాడు)

సత్పుత్రి—'వనితా కవితా చైవ స్వయమే వాగతాగతా' అన్నారు. కావున కవిత్వము చెప్పుటకు శాస్త్రపరిచయ మక్కరలేదు.

నిరంజనుడు—(పట్టుబట్టలు కట్టి చందనము శరీరమెల్ల నలంది ఉంగరములు వ్రేళ్లు విగ్గుతో ప్రవేశించి) "అథవా మళ్ళీవస్తే జీర్ణం భ్రష్టాచ, ఖండశః" అని కూడా అన్నార్. కనుక మంల మన యొద్దకు రాకుండ జేసికొనవలెను.

సత్పు:—ఓరీ. యెవరునీవు. ఇతరశ్లోకార్థము నేజదివిన శ్లోకార్థముతో మేళవించి మేలమాడుచున్నావు.

నిరం—నేనిచ్చటకు మేళమాడుటకై గజ్జె గట్టి రాలేదు. ఏదో శ్లోకముచదివి ముక్కుకు సూటిగా నర్థముచేసికొని సంతోషించుచున్నావు గావున, నీసంతోషముతో నాసంతోషము కూడా చేర్చితిని.

సత్పు—నీసంతోషమేమిటిది?

నిరం—

క॥ కరయుగములు చరణంబులు
యురము లలాటస్థలంబు నున్నతభుజముల్
నిరతముగ వ్రాయ నేర్చిన
నరకరుణా వాని వ్రాలు నటుపై నమరుణ్

నట—అనగానేమి?

నిరం—

క॥ పొగచుట్టకు సతి మోవికి
ఖగపతి సురపతిని యిచ్చి ఖాండవమేర్చెన్
ముగురాడు వారు జేరిన
మగుణము భగణమ్ముకాదు మహాలో వేమా॥

నట—నీకు వెట్టియా పరిభ్రమణమా?

నిరం—"నాకు రాదిప్పుడు సంధ్యావందనం జేసియుంగ"
ఇది జ్ఞప్తియందున్నదా?

నట—(యోచించుచుండును)

నిరం—సాంగోపాంగముగా పఠిస్తున్నడ.

నట—ఆ! ఆ: హరిశ్చంద్రుని యొద్దకు బోవుచో విశ్వామిత్రుని యెదుట పఠించిన పద్యము.

నిరం—ఆ అప్పుడు నీవిద్యాస్థితి ఆలాగున్నదే ఇప్పుడు దాని కంటే భూత కాలముగదా యిది. శుక్రునొద్ద చేరినంత మాత్రమున నీకు విద్య విశేషముగా వచ్చినదా, కవిత్వము పేరెత్తుతున్నావు. (వేలు కొరికికొని) నేనే పొరబడితిని నీవు ముందుగా 'వనితా' అని పిలిచితివి.

నట—నా గొడవ నికేల నీతోరివను నీ వరుగ రాదా. రాద్ధాంతము సేయ వచ్చితివా? ఇంత యవివేకమేమి! ఇంత మొండితనమేమి? నేను వనితా యన్న నీ కేమి కవితా యన్న నీ కేమి? సంధ్యా వదనమే రాదట! నీవు నేర్పెదవా? శృంగారాంచిత మదన మో హానమూర్తిని దశదిగ్వరవర్తినీ విలాసలసత్ కీర్తి కాంతామనోహ

రుండను సకలకలాకలాపప్రాపకప్రభూతవిఖ్యాతివిద్యోతితుండను

నిరం——నేనును చదువుకొన్న వాడను గానుతే అందువల్ల నీ సమా
సములు నా కర్థమగుట లేదు. సమాసమునగా నాయభిప్రాయ
మే మంటే స-మాసం- అనగా మాసంతో గూడినది. అంటే,
మాసంవరకు చదివినను తరుగు విదురు లేని మాటల మాట
యని

నకు——నీవెవరవు. నీపాట యిచ్చుట యెందులకు.

నిరం——నేను నిరంజనుండను, నే పాట చెప్పుటకు రాలేదు ఒక
పాట పాడి పోవుదును గాక యని వచ్చితిని.

నకు——ఏదీ పాడు.

పాట-శ్రీరాగము-త్రిశ్ర.

నిరం——

నవిటిమీద-వానబడాయె-నీకవిత్వము ॥ చట్టుబండలోయి-మట్టికుండలోయి -
పపనిపనిప-రీగరిరి -సానిపనీసరీ ॥ సారిగరిరిమం -రీగరిగామపా -
వట్టిదండలోయి - యెండలోయి
మాపనిసానిసా - సాసాసా

నకు——

శా॥ ఓరీ మూర్ఖుండ, దుష్టుండా జడుండ, యోరోరీ యధర్మాత్ముండా।
క్రూరా ద్రోహి కఠోరచిత్తుండ ననున్ గొంటుం దనం బూని నీ।
పేరీతిం దిగనాడుచే గనుము నిన్నీతి గారింతు నో।
హోరా నీవనియేమి చేయునది యిచ్చోయేమి భాషింపరా॥

నిరం——నీ వన్న వారిలో నొక్కడ నైనను నేం గాను. ఈకోపమేల?
నేను నాతోవనేగు చుండ నీవు కన్పించితివి. అందువలన నే
నాగి, నీవేమిచేయుచున్నావో చూడ వచ్చితిని. దర్శనమాత్ర
మున నన్నాపి తిట్టుచున్నావా?

కు——నీ వెక్కడ నుండి వచ్చుచుంటివి?

నిరం——అట్లనుగుము నే నింద్రుని దర్శింప వచ్చితి. ఆయన రాగరత్న
సహచరుండై యంతఃపురంబున నుండి కొంతసడికి దర్శనంబిచ్చె.

నే నభినయము కొంత నేర్చిన వాడను; పంచకావ్యపఠన మొన
రించిన వాడను; పండితగోష్ఠి గల వాడను, నన్నీ నాట్యసభ
యందు జేర్చుకొనుండని, వేడుకుంటిని, ఆయన పెదవి విరచి,
శుక్రాదుల యొద్దకు బొమ్మనెను. వారిం జేరితిని, తీర్పరులు కొంద
రందు జేరియున్నారు. అందు గానధునియట త్రాచుఫణి యటు
లున్నాడు.

నతు—అదేమి.

నిరం—

గీ॥ మేను సన్నమై పొడుగుగా మేకొనియెను
మిలమిల యటంచు చూపుజో డలమె కనులా
ఆగ మూరక కసుబుస్సులాడు చుండు
త్రాచు పాముని నెమ్మదిఁ దలచి నాఁగ

నతు—తరువాత.

నిరం—నన్ను చూడగనే పాడు మనియెను. ఒకశ్లోకము పాడితిని
మూతి బిగించెను, రెండవది తెనుగు పద్యము పాడితిని. ముఖము
చిట్లించెను. మరియొక తెనుగు పద్దెము పాడఁ బోయితిని; వెంట
నే యాతడు కినియుచు లేచి.

ఉ॥ పాడెదవే యరాగముగ పద్దెము, ఛీ, వలిశేగుమోరి, మా
రాడక పండితుండవని యట్టె యహంకృతి బాప జోరుమీ
పాడి తొలంగి నాయెదుట భావము గీతము నంచు బల్కినన్
ఊడఁగఁగొట్టెదన్ రదము లుగ్రతరంబగు తాడనంబులన్॥

అనియెను మఱియు.

గీ॥ క్రొత్తసంగీతము నేర్వకుండ యొకరు
డిచ్చుటకును రాఁజనదు తా నెప్పటికిని
నేర్చికొననెంచి వచ్చెనా స్నేహితుఁడగు
కాని యెడ వైరివిధమున గాఱియపడు॥

అనుచుం జక్కఁబోయెను అంత నేనా చెంత వారి నెల్లవృత్తాంత
మడుగ. ఇందు జేరదలంచిన వారు చదువరులు కాకపోయినను, రంగు

కంగున సంగీతముపాడ గలవారుగా వలయును. నూత్నశైలి కీర్తనలు నేర్చియుండవలయును; గానధుని శుక్రాచార్యులను గొలుచువారై యుండవలయును అనిరి. అంత నాకీక్రొత్త గానమెట్లు లబ్బునా యనుకొని పోవుచు నిన్ను జూచి నీ యాశ్రయము పొంది యుండవచ్చును గదాయని యిందు చేరితిని.

నటి—ఓయీ! అట్లయిన నిష్కారణముగా తెల్లబోతింటివే. ఇదిగో శాస్త్ర నాట్యపద్ధతి ముందుగా నెఱుంగవలయు. వినుము సూత్రములు చాలకొంచముగనే యున్నవి.

నిరం—వినియెదను. ఆహాజాగము సంఘము వారెల్లరు నధికారులుగా నుండిరేమి? చూతము.

సీ॥ తన్ను తన్నుడటంచు తనిలి శేకలువైచెరాగ రత్నమిదేమి బాగు తనకు
నింటి వేయుడటంచు శేకలిడగ సాగ యమునిడ దహా వాని మర్యాద యేమి
ఈడ్చి వేయుండంచు నింకొక్కడనియెను వాని వైభవము గవ్వయును గాదు
చుఱుచుఱులాడుచు శుక్రుడు మనసాగె మానముధరియించి మానిగాన

గీ॥ పగుగు రేకమై చుంపి వేయుదురటంచు భీతిమై పర్వు పర్వున వెడలినాడ
విన నేమాయె నేనెందు నరుగజాల నూత్న నాట్యము నేర్చుకొందును సఖుండ॥

నటి—అయిన వినుము నీకు పద్ధతి నెల్ల తెల్పెదను. చక్కని విధముల పాటలను నేర్పెదను. నీకు స్థిరమైన జీవనగతి గల్పించెదను. కాని, ఒక్కమాట జ్ఞప్తియందుంచుకొనుము. ఈసభా భవనమునుండి వెడలగొట్టబడిన పూర్వపు నటులు క్రొత్తవారల ననేకుల పోగుచేసి యీసంఘమునుండి చీలదీసి వారినెల్ల పూర్వనాట్య పద్ధతులకు పురిగొల్పి మాయుద్యమము చెడగొట్ట జూచుచున్నారు. నీవు వారికి లోబడితివేని వేయివిధముల చెడియెదవు. నాకెదురైనను వారితో తలయెత్తి పలుకగూడదు. పలుకరించినను, వారిని మోమెత్తియైన చూడరాదు. నా పలుకు నిరాకరింతువేని, వారు నిన్ను మంచిపద్ధతి, కళాభివృద్ధి, యను

మిమను, శాస్త్రములు చదువుమనియు, అభినయాదుల నభ్య
సింపు మనియు, సరిగమలతో నారంభించి సంగీతము నేర్చు
కొనుమనియు మిక్కిలి పీడింతురు.

విరం—కష్టమేమియు పడలేక యేగదా యిందు జేరితిని. కాని కంఠ
స్వరము మధురమైనదే విస్తరించి పాడు నభ్యాసము లేక
పోవుటచే—

నతు—అభయ మక్కర లేదు. విస్వావస్తుప్రయోగరహస్యము నేనింత
యుపదేశించెదను. తన్మూలమున నీవు పెద్ద పాటకుడవయ్యె
దవు. ఇంక నీపద్ధతి సంపూర్ణముగ గ్రహింపుము. (పుస్తకము
విప్పి చదువుచున్నాడు)

గీ॥ నాటకకళకు ముఖ్యంబు పాట గాని,
అభినయము గాదు; భావరసాదికముల
జ్ఞానసంపద గాదు; భాషావిశార
దత్వసిద్ధియు గాదు; సుదంచితముగు॥

గీ॥ గాన రసమాధురీ విలాసానురూప
భావరాగ కాళ విశుద్ధ పద్ధతులకు
నుచిత సంస్కార మొసగించు నుత్తమ మగు
స్వరపరిచితంబయిన గానబంధురత గాదు॥

గీ॥ కాన నటులభ్యసింపంగ గల దొకండ,
నూత్నకీర్తనల్ పాడు నభ్యాస విధియ
ఇంటియొద్ద పాఠ్యపఠించి రొట్టు లేని
యొప్పగించినవాలును, లేకున్న తప్పు లేదు॥

గీ॥ నాల్గువిధముల యది, యభినయ మటంచు
భరతముని చెప్పె నొక్కటి వాచికమని,
వాచిక మనంగ ప్రాంటింగు ప్రౌఢగతుల
నందుకొంట నేర్చికొనుట; యట్టులుండ॥

గీ॥ ఆంగికాభినయం బుండె నంతకంటె
ననలఘమైనది. గాన మందులకు గురువు
రాగమున కనుకూల మార్గముల నవయ
వమ్ము లాడించు నాంగిక పరిష్కృతి యొందు

క॥ కల దాహార్యమ్మనునది మలయుచు
నల దృష్టివిభ్రమ మొమ్మదపంగా।
లలి వేషము దాల్చుటయే యిల
నటునిష్టంబు సిద్ధి యొసగంగ నెటులా॥

గీ॥ కాల దేశ పాత్రా ద్యనుకూల గతుల
నటుడా చరియింప బనిలేదు; నాటకము
రంగము నలంకరించు తెరంగులందు
గాని మిగిలిన యట్టి మార్గములఁ గాని

గీ॥ సాత్త్వికాభినయమ్మన జగతి యందు
నే యవస్థకుఁ దగురీతి నా యవస్థ
ముఖమునం జూపుటయు; యది మూఢులోక
ములను పిల్లలకైనను దెలియు గాద॥

క॥ పాశ్చాత్యనియమము తద్ధాయును
నిర్మల వరనాట్యతత్త్వవిజ్ఞాతృకముల్
దుర్మతులు ఆనాస్థారు
కర్మిష్ఠులు గారు వారు కపిమి నటులతోడ

ఇంక నాటకరచనకు శుద్ధి నియమము లెఱింగింతు.

(పేజీలు తప్పి)

గీ॥ ఎప్పటిదియైన, కథ, యేమి, యిప్పటిజన
ములకు, తగియుండి తద్వర్తనలకు నభిరు
చులకు, నింపుగా ననుకూలశోభ, వెలుగు
చుండినం జాలు; నాటకముత్తమంబు

గీ॥ పాటలుండంగవలెఁ బ్రతివాని కొకటి,
యైన, నచట నచట పద్య మధికదీర్ఘ
బంధుర సమాసయుతమయి వరలవలయు
నిస్సమాసగద్యం బెందు నెగడరాదు ॥

గీ॥ ముఖ్యపాత్రమ్ములకునైన మూడు నాల్గు
పుటల వచనభాగమ్ము సమ్మతము గూర్ప
నుండవలయును! పద్యము లుండ వలయు,
తోరణము గాగ నొక్కచో చేర్చినైన

గీ॥ ఉత్తమమ్ములు లేనిచో నుత్తమమగు
నాటక మ్మది గాదు: తనదు మనసున
కు తగినంత వ్రాసి పెంచుచుం దగు కవికి
కొంత విడిచియైనను నాడు కొందఱి సభల ॥

గీ॥ నవల లేనియు హాస్యరసమ్ము లేని
యుత్తరవిధము నా కావ్యమ్ము లెవ్వరేని
నాటకంబులుగా నుంట నాట మగును
నాట్యకళ వృద్ధియయి నానాటఁ బెరుగు ॥

గీ॥ పద్య పద్యమ్ములకు గాని పాట పాట
లకును గాని పద్యము పాటలకును గాని
సత్య గద్యముల్ లేకున్న సాధ్య పడదు
సుతుల భేదముల్ పాటించు చుండ్రి గాన॥

నిరం—మహాత్మా నేను కృతార్థుడ నైతిని. నిన్ను యనుసరించి యుంటిని. నన్ను దరి జేర్పుము.

నట—మంచిది యింకను కొన్ని విశేషములు ముందు చెప్పెదను రమ్ము [నిష్క్రమింతురు]

సీ॥ సురలోకమున వారు చిరకాలమున నుండి యనుభవించెదు వైభవాలి యెల్ల
నీయనుగ్రహముచే నిన్న మొన్నటిదాక వారు గాంచెదు సౌఖ్య పాళి యెల్ల
నీ సభాస్థల యందు నేటి దనుక వారు తగగాంచు చుండు స్వాతంత్ర్యమెల్ల
నీ యిష్ట మొదవించి నెమ్మి వారార్జించు పురుషార్థసిద్ధి సంపూర్ణముగను

గీ॥ ఇంత నుండి యీ మూకకు నంతయైన లభ్యమగుట యేనోర్వను లలితమూర్తి
యేమి కట్టిడి చేసెదో యే నెఱుంగను వారి ప్రాభవం బడగింప వలయుం జూమ్మ

యము—అంతియగాక, వారిగర్వమునకు మేర లేకున్నయది. వారి విద్యావైశద్యము ముందు మేముగవ్వకైన గొఱగాకయున్నారము.

శుక్ర—భరతుని కడ వారు నేర్చిన విద్యావ్యాసంగ మరి కట్టబడక మేము బ్రతుకజాలము.

రాగ—మఱిచితి వారి నింక నేదోటను పాడనీయ గూడదు. ఏయితర నాటకములయందు పాల్గొనసీయరాదు. ఈసభయందు వారుచెలికత్తెల వేషములు వేయుటకు చిన్నతనమట! ఆ ధీరత్వము తొలంగ జేసిననేగాని తీరదు...మీ రేమా యోచించు చున్నారు. నేను తీవ్రముగనే చెప్పు చున్నాను.

యము—సుందరీ ఇంక ననేక విషయము లున్నవి గదా! ఒక్కమారుగ నన్నిమార్పు లొనరింప నిలువకునా త్వరపడకు. ఇదిగో యిటువిను.

గీ॥ మిగులు దిగ్ధీశ్వరులు మన మేలు గాంచి,
యోర్వజాలక సురగురు నొద్ద జేరి,
భరతు నాశ్రయించి నారట; పాపాలభైర
వుం డతం డతిసాహసముం బూనఱ్చు

శుక్ర—వానిం గుఱించిన భీతిమీకక్కర లేదు. గాధేయ సంరక్షితమై శుక్రనీతివిన్యాయకమైన యీవ్యవస్థతికి కీడు పొసంగింప రుద్రునకైన గారాదు.

యము—అటులన వలదు. ఆదిక్పతులు ప్రబోధకనిరంజనాదులకు దుర్బోధలొనరించి మనలో కయ్యమునకు గాల్దువ్వునట్లు సిద్ధమొనరించి యున్నారు. ఇంటిగుట్టు లంకకు చేటన్నట్లు లేమి కాగలదో. మనము జాగరూకులమై యుండ వలయును.

రాగ—అదియును గాక, సురవేశ్యలు శచీదేవి నాశ్రయించి మనల వెడలింప నున్నా రని యును వింటిని.

యము—శచీదేవి యాజ్ఞానువర్తియై దేవపతి మనల నధోగతిపాలు గావింపడని నాకు నమ్మకమే.

ఇంద్రు—(లేవగా నందరునిలతురు) కానిండు నేనన్నివిశేషములు గమనించుచునే యున్నాను. ఇంక నాలుగుదివసములలో మనము గావింపవలయు నాటక పరిదర్శనమును గుఱించి యోచింతము
(నిష్క్రమించును)

రాగ—ఆనాడు దిక్పతులు భరతమునితో నేగుదెంచి చాల యలజడి గలిగించు ననివింటిని,

యము—ఆ! అందులకు మనము భయపడుటయా?

మహాస్రగ్ధరా,

భరతుండే వచ్చి మమ్మపరిహతధృతి శాపసంభవంబు మీరన్ ।
హరియింపం బూనినిమ్మా త్మయుతభుజబలదివ్యద్యుతుల్ పొంగ వేసే ।
మరణింపకేతుఁజుమ్మా మహిసెవఁడయినన్ మత్సరంబూని నాపై ।
కుటిలకంఠాగఁ బాలుకొల్లొ యుతరనరకపాఖ్యతి నాయండనుండన్ ॥

(అనిగంతులువేయును)

రం డింక భయమేల? పోవుదము. [నిష్క్రమింతురు]

## 4వ రంగము

[కొందరు కులపులు ఇష్ట వేషములతో గాలిషికారుగా ప్రవేశింతురు]

[సాగరుఁడు, చండిముండు, డిద్ధుడు. దబిద్ధుడు మొదలగువారు]

సాగరుఁడు—మిత్రులారా! ఏమి విశేషములు?

డిద్ధుడు—రేపు దేవనాట్యసభయందు నాటకము ప్రదర్శింతురఁ బ ను. అదియే విశేషము.

దబిద్ధుడు—పారమున కొక సారి యీవిశేషము చెప్ప నవసరమే లేదు.

డిద్ధ—ఓయిదబిద్ధా! ఇయ్యది కొత్త నాటకము. విశేషముగాదా.

దబి—ఆ! విశేషమే. డిద్ధా ఎన్నాళ్లకు వింటిమోయి కొత్తనాటకమను శుభవార్త! ఏదీ ప్రకటనాపత్రము.

డిద్ధ—ఇదిగో రంభారావణీయము. శుక్రాచార్య—ఓహో జగద్గురు శుక్రాచార్యవిరచితము. రంభ, రాగరత్నము.

రావణుడు, దక్షిణరంగస్థీశ్వరులు సూర్యనందనులు, శమనులవారు. శుకమహర్షి-గాన విద్యాకుశలురగు ప్రబోధక నామదేయులు. మిగిలిన వేషమ్ము నటశేఖరులే ధరింప బడుదురు.

సాగ—మనము ధరింపబడుదుము. సరే. నేనొక విశేషము దెచ్చినాను. ఇదిగో యీ కాయితము చదువుకొనుఁడు.—(ఇచ్చును)

చండి—(చదివి) ఇదెట్లు లభించెనోయీ సాగరా.

డిద్ధ—ఏమిటిది. (లాగబోవును)

చండి—(వెనుక నిడుకొని) ఉండు

సాగ—భరతముని శిష్యుఁడొకఁడు శుక్రాచార్యునియొద్ద విద్య నేర్చుకొను నెపమున వేగునడపుటకుఁ బ్రవేశించినాఁడు. వాని వలన లభించినది.

డిద్ధ—చండిమా. అతండే నేమొన్న చెప్పిన నిరంజనుడు. ఒకొక్కపరి, వారల నెల్లరను పరాభవించి విడచినాఁడు.

దబిద—అంతేమున్నది?

చండి—నటులు రహస్యసభలో గావించుకొన్న కొన్ని తీర్మానములు గలవు. వినండి. అయ్యో కొంత చినిగిపోయినదే.

సాగ—వినదగిన వన్నియు నున్నవిలే. చదువు.

చండి—ఒకటి. నటులే భావభేదములులేక, ఒక్కపద్ధతి నవలంబించి, విమర్శకుల తప్పును వ్రాతల లక్ష్యము సేయక, పత్రికా సంపాదకులనే లీలనైన నశపఱచుకొని, వారివారి కనుకూలము లగు పొగడితల నందుచుండవలయును.

డిద్ధ—ఈ తీర్మానము నిజముగా ప్రాముఖ్యత వహింపదగినదియే.

చండి—సంగీత విద్వాంసుల నాశ్రయించి, కవుల యనుగ్రహము వడసి, నాటకమునకు గానమే ముఖ్యమనియు, నిప్పుడు వాడుకలోనున్న సంగీతమే, యీ కీర్తనాపద్ధతులే యక్తమనియు ననిపించి, లంచము లిచ్చియైన, ప్రశంసాపత్రము లందవలయు.

డబిద్ధ—పై దానిని మించినదే యీ తీర్మానము.

చండి—పెద్దల, ప్రదర్శనముల వీక్షించు కౌతుకము గల వారలను నాహ్వానించి, వారి యౌదార్యము వలన గాని రాబడిలో గొంత ధనమిచ్చిగాని వారి వలన పతకములు ప్రశంసాపత్రములు మొదలగు బహూకృతు లంద వలయును

నాల్గవయది. సంఘాధీశ్వరులే మైనను, ఇట్టివ్యయములను వలయు ధనమును రాబడినుండియే యేర్పరుప వలయు మఱియు వారి యెడ నభిమానము వదలి, ధనలోపముగలిగి నప్పుడైనను నటులకు వలయు ధనముజీతబత్తెములు మొగమోడక, యేమాత్రము విడువక, కాలవిళంబనము సహింపక, యెప్పటి కప్పుడు తీసికొనుచుండ వలయును.

డబి—ఇంకను ఉన్నట్లున్నదే.

చండి—ఒక్కటిమాత్రమే. అయినను. క్రొత్తనాటకములుచదివించుట అభ్యాసవశమున నటుల నుంచుట మొదలగు సంగతులలోనటులకును మనమే సంపూర్ణ స్వాతంత్ర్యము గలిగియుండ వలయు. హార్మోనియం తబ్లా వారు మన కనుకూలురై యుండవలయు.

గీ॥ లోకవృత్తి వీక్షించియే నాటకతతి
స్వానుభవ వృత్తముల శాస్త్రము లొసంగి
నియమముల నేర్పరించిరి నెమ్మి వారి
పేరు నిలుపుకొనం గాదు, నికటబుద్ధి॥

గీ॥ శాస్త్రములయందు ప్రకృతి వైషమ్యము లగు,
నియమము లుంచరు గాన మిందరి యతితులకు,
పుల్కరము గల్పు చందముల్ స్ఫురాయ యుక్తి,
యతియుఁ బ్రాసయు నాదసంగతులు నక్క॥

మఱియు, నాటకములయందు నిప్పుడే కారణము చేతనో యెల్లరకు విరోధభావ మంకురించె, ఏకథ నేవిధమ్మున నాటకముగా నొనరింప వలయునన్న సంగతి గావింప నవ్వైన నాట్యశాస్త్రమునెడ ద్వేషీకార భావము ప్రబలినది. తుదకు నూతన నాట్యపద్ధతి ప్రవ ర్తించుటయు నిరసించి డామోదించుటయునా!

ఇప్పుడు జనులయాను.

శా॥ ఆయుర్భాగ్యము హీనమయ్యెను బలంబా నష్టమయ్యెం గదా
శ్రద్ధయు వాసె నటంగె బుద్ధియును శాస్త్రీయంబులౌ పద్ధతుల్
డాయంజాలరు శాస్త్రముల్ చదువువారల్ లేరు, సిద్ధాంతమా
ర్గాయత్తుండగు టన్న పూర్వ విభారంబయ్యె నిప్పట్టునన్॥

తన యనుభవముచేతనే విద్వాంసుఁడు నగునను నని నేటిమను ష్యున కేమి సమాధానము చెప్పవచ్చును? మనుష్యేతరజాతికి పుట్టుకతోడ సర్వావస్థలు సాధనములు, మనుజుఁ డభ్యసింపక నేకా ర్యము నొనరింపఁ జాలఁ డనుట నిశ్చయము, ఈ సంగతియే మఱ చిపోయిరి గదా మనుష్యులు. మఱియు కళలకును, విద్యలకును శా స్త్రములకును ప్రకృతికినిగల సంబంధ మేమియో, భేద మేమి యో, తెలిసికొనఁ జాలకున్నారు. ఇప్పుడు నే నేమి సేయవలయు?

గీ॥ శుక్రనీతి నడంచి శతక్రతుని, న
గుంకరించి జగమ్ముల ధర్మగతిని

గీలుకొలిపి, సమసిన విద్యాలలావు
ణ్యైన భారతిక జీవితగా నొసర్తు॥

ఎవడో వచ్చుచున్నాఁడు! ఓహో! నిరంజనుఁడా. ఏమిరా విశేషములు.

నిరం—గురువరా రేపు శుక్రవిరచితమైన, రంభా రావణీయమను నాటకము ప్రదర్శింపబడును.

భర—పేరు విన్నంజాలును. నరకమున పాపులబాధలకును, నేటి నాట్యరంగముల నటుల యభినయమునకును భేదము లేదు.

గీ॥ ఏమి చేయంగవలయునో యెఱుగ కొకఁడు
యొటుల మెలంగవలయునో యెఱుఁగ కొకఁడు
పండితమ్మన్యతా ప్రభావమున నొకఁడు
తన్ను కొనుచుం జెదరు నిరంతరమునందు॥

నిరం—నిజము గురువరా నిజము నాటకికథాసంగ్రహము వినిపించెద నవధరింపుఁడు,

రంభ శుకు సర్ధించుట. శుకుడు నిరాకరించి పోవుట. రావణుడు రంభ నర్ధించుట రంభ నిరాకరించి పోవుట, రావణుఁడు రంభ కొఱకును రంభ శుకుని కొరకును వెతకుచుండుట. రంభారావణులు తారసిల్లుట. రంభను రావణుడు బలవంతముగ నెత్తికొని పోవుట శుకుడపుడు వచ్చి రావణుని శపించుట.

భర—శుకుడు రావణున కొసఁగు శాపము దేవనటులకు, నాట్యసంఘాధిపతులకునే నొసంగు శాపముగా మారిపోవును గాక. ఓయీ! మనయందు పక్షపాతముగలవా రందెవరైన నున్నారా.

నిరం—వేయిమంది.

భర—అయిన జయించితిమి రమ్ము పోదము

(నిష్క్రమింతురు)

# తృతీయాంకము

## 1వ రంగము

సూర్యుడు (వెండిపొన్ను కర్రి - జలతారు ఖండువా తలపై కుచ్చులు ఆడులాగున జుట్టి శాలువచే శరీరమునుగప్పి సన్ననైన అత్తాకోడలు అంచు దోవతికట్టి నలువంకల నలుగురు చేతిలాంతరులు పట్టివచ్చుచుండ రవ్వాల కమ్మలు వెలుంగ పౌడరు పూసిన ముఖము ప్రకాశించుచుండ స్లిప్పర్లు చిత్రమైన పనితనపు మెటుంగులు గలవానిని ధరించి ప్రవేశించుచున్నాడు.)

(పాట, - తోడిమేళం - ఆది)

నా..............కేన్నాయసమమీ - జగమున - ఏక్రియరోచించిన = లోకము
నీసానిసరీసరిగానిసనిసరీసదపమాగ - ససనిస - గామప గమపానిస = పా మ
నకు - నేనే బ్రదుకుగదా - నాకసమానిన నేమిలేదు
గరిస - నీసానినరీ గమరిగ - సాగమపాదదగామరీస

సృష్టిసకలమ్ము నన్నెఱుంగున్ - ఇష్టప్రీతి నన్ను భజించుచుండున్ - కష్ట నిష్ఠురమ్ములులేక జరింతున్ - సం - తుష్టినాకు కడుసారమై వెలుంగున్

(ఆది)

ఎంతగలోకము - తమకము హెందిన, అంతగనాకు నుత్సాహంబౌ - అ.........
దాససాసస - సరినగరీ స స - గరిసనీద పమ పా పా పా - పమగారిసమ
................॥
గరి సరినసమపదని॥

(మీసములు త్రిప్పి) జగన్నాటక సూత్రధారి యగు నా రాయణుడు నాయందున్నాడన్న విశేషము, ఎల్ల జగంబులకుం

దెలియు; నేను వానియందున్నాను. నా వెలుంగుగదా (చిరునగవు)లో
కములకు కాంతి. (తలత్రిప్పి) నను గనక సన్నము తిన రేయూడు నా
రు సైతము. (కరత్రిప్పుచు) ఈవిధముగ నే నొక్కవ్యక్తినైన నొక్క
యెడ స్థిరముగ నుండక లోకము నెల్ల జుట్టి వచ్చెదను (నీటుగ మేను
కంపింపం జేయుచు) జగన్నాటకసూత్రధారుడు నాయందున్నాడు.
కావున నేనీ విశ్వమునందలి నటులలో శ్రేష్టుండను (తలయూచుచు)
ఎట్లు కాకుందును? కానిచో ఆసూత్రధారుండు నాయం దేలయుం
డును? జగత్తునకు రసప్రదాతను నేనే నావలననే వాయువు జలము
జగము, సమస్తము నైనది.

అన్నియు జగత్తున కుపకారమొనరించు నవియే. కాని నా
కుంగోపము వచ్చినా మలమల మాడ్చెదను. జలప్రళయమున ముంచె
దను. చండతరవాతములచే గొట్టివేసెదను. నా పేరెల్లరకు నిత్యజప
తపప్రవృత్తికారణ మైనది. ఓహో నా స్నేహితుండు చంద్రుం డింకను
రా లే డేమి?

శా॥ ఇంకన్ రాడిదియేమి నాహితుడు తా నిచ్చోటికిన్, భవ్య తా
టంకాంతర్గత పుష్యరాగవిభవాఢ్యస్ఫీత కాంతిచ్ఛటా
సంకీర్ణాఖిల దాంతి మండలయశస్సామ్రాజ్య సుజ్యోత్స్నికా
జ్యాంకోత్తీర్ణవిలాస సంఘటిత విద్యాధరాధీశ్వరోత్కటీ
టంకారాయత చంద్రమండల........................

(అని సమాసమును పూరించి చప్రమండగా చంద్రుడు ప్ర
వేశించును)

చంద్రుడు (గోపుపాదపంతజుట్టు, విభూతిబొట్టు, అంగవస్త్ర
ము మొలచుట్టు, శాలువకంఠమునుచుట్టు, మెడలో బంగారు తాడు, చే
తికి మురుగులు, పుస్తకము (అచ్చుది) వెండిపొన్నుకర్ర)

ఏమి నీ సమాసపుట్టహాసము ఆట్టే హాసమునకు గారణమై
ననట్టున్న దే.

సూర్య—అదేమి?

చంద్ర—పూర్తి కానట్లున్నదే? ఇంకను,

సూ—కాలేదు అయినదేమి? (అంతలో నొకడు సూర్యునకు నమస్క రించి పోవును. సూర్యుడు మిక్కిలి దైన్యమును ముఖమున వ్యాపింప చేయును)

చంద్ర—ఈజన్మములో పూర్తియగునా?

సూ—కాదు. ఆసమాసము నా జన్మమునకంటె దీర్ఘమైనది కావచ్చు ను. నీ కేమి కొంత. నీ వెవరితో మాటాడుచుంటివో యెఱుం గుదువా? చెప్పుము.

చంద్ర—నీ తోడనే

సూ—అనగా

చంద్ర—సూర్యునితో

సూ—అంతియేనా? (మిక్కిలి సిగ్గు మీసలు మెలిపెట్టి)

చంద్ర—మఱెవరును లేరుగా?

సూ—నీవు మఱచితివి. నీకు నీ ప్రకాశమొసగి వఱనగలుగు చున్నదో వానితో; నీ వెవని మూలమున షోడశకళాపరిపూర్ణుం డవగుచున్నావో, వానితో అప్పుడే యెంత నాడవైతివని నన్ను మఱచితివి!

చంద్ర—ఓయి శృంగారమూర్తీ నాకున్న కళాపరిపూర్ణత్వము గురుదత్తమని తెలియుము.

సూర్య—గురుదత్తమేదో నే నెఱుంగుదు. నెలకొకసారి సం పూర్ణ స్వరూపనాశనముగావించు ఘోరమైన శాపము,

గీ॥ తెలియని మనుష్యునకు చెప్పు తెలుగు గొప్ప
దీర్ఘ గంభీర భాషణోద్వేగ రచిత
డాంబికావళి యిటుచొప్పడంగ నకట
పలుకుచున్నావు నీ జిహ్వ పొడుగాను॥

పైగా, లోకవారములకు సమస్త రస సమృద్ధి కావించు నన్ను శృంగారమూర్తియని నిందార్థ్వముగా బిల్చుచుంటివే. వెఱ్ఱి కుదిరినది రోకలి తలకు జుట్టమన్నాఁడఁట

చంద్రి—ఓయీ సిగ్గులేక గురుదత్తశాపమును జ్ఞప్తికి దెచ్చుచున్నావా?

సూర్య—అవు నిటువిను.

గీ॥ త్వన్మ ఘాబ్జాత గేహిని బంధురన ప్రిభావ యువ ధాత యీశ్వరి।

అరె-ఊ (తెల్లబోయి వేలుకొరుకు కొనుచున్నాఁడు.)

చంద్రి—(కీచుగొంతుకతో కేక లిడుచు చప్పట్లు గొట్టుచున్నాడు.)

సూర్య—ఓరీ గురుదారాపహారణ ప్రవీణ నన్ను గేలిచేయకుము జాగ్రత్త.

చంద్రి—ఈ బిభీషికలకేమిలే. కుంతీకన్యా త్వభంగకరణోద్యోగశీలా నీచరిత్రము మఱచి మిట్టిపడకు; నీ పెద్దకొడుకు యముడు

గీ॥ ప్రేతతతిసమావాహ కావ్రిదమైన,
పెద్ద యుద్యోగముంగల్గి వెలుఁగు వాఁడు

ఇంక రెండవవాడు కర్ణుడు

ఘోర భారతయుద్ధమం దోరిమి చెడి,
నిహతుడయ్యె దిక్కు గనక నిజము గాను

సూర్య—ఛీ! సంతోషకరముగా నాటకము చూడఁ బోవుచుండ అశ్లీలము లాడెదవు.

చంద్రి—మనము చూడఁబోవునాటకము విషాదాంతమే- పోదమురా

నిష్క్రమింతురు

## 2 వ రంగము

(నాటకశాలాభవనము లోపలిభాగము రంగస్థలమునకు వెలుపల-కొందరు బీడీలను, చుట్టలు సిగరెట్లు చేతబట్టి కాల్చుటకై నోట బెట్టి మాటాడుకొనుచుఁ అగ్గిపుల్లలు వెలిగించుచు, పారవేయుచు, ప్రసంగించుచున్నారు నక్షత్రికుడు రాక్షసులు యమభటులు అశ్వినులు)

1 రాక్షు- కుబేరమిత్రునికి ప్రోత్సాహకరముగా వేషములిచ్చేక పోవుటచే వాడిలు వెడలి, విభీషణవ్యవహారంలోకి దిగినాడు. తన్నించుదామనుకొంటే కంటబడడాయెను.

1 యమ- వాడు ధనదునివలన సహాయము పొందుచు ఆకాశయానములందే సంచరించుచున్నాడు.

2 రాక్షు- వాడనేకవిధముల మనల నవమానించుచున్నాడు శ్లోకమొకటి పత్రికలపై వ్రాసి యెల్లరకు దెలియునట్లుగ నన్ని గోడలపై నతికించినాడు.

3 రాక్షు- ఏమి శ్లోకము.

2 రాక్షు- ఇదిగో, (అని చదువును)

శ్లో॥ బుద్ధిశ్చైవైకమంత్రిం సకలకలహకోలాహలా దానమంత్రిం
విత్తధ్వంసైకమంత్రిం సుగుణగణనిరస్తీకృదుద్గాఢమంత్రిం
ఆయుర్నష్టైకమంత్రిం నవజలజనిబాచ్ఛిపత్రినాశైకమంత్రిం
కాలశ్చైవైకమంత్రిం జపతపసతతం శిష్ట పేకాఖ్యమంత్రిం ॥

నటు—— వెధవశ్లోకం చింపి పారెయ్. (లాగికొని చింపును)

1 అశ్వి- కను శిముఖ్య దేవలోకమునందెల్ల సంచరించి భారతీయ నాట్యశాస్త్రమునుగురించి యుపన్యసించుచు జనులకు మనలయెడ ననహ్యము పుట్టించుచున్నాడని తెలిసినది.

2 అశ్వి- ఈ యుపన్యాసములవలన మనకేమియుహాని లేదు. మన ప్రయత్నమింక కొన్నిదినములు కొనసాగినా. యేలోకమునందైనను శుక్రపద్ధతికి విరుద్ధములైన ప్రదర్శనములకే యెడముండదు ఇప్పటి ప్రజకు మనపద్ధతియందే యభిరుచి యధికముగాంగా నితరమైనదానిని గ్రహింపజాలకయు నిరసించుచును మెలంగుచున్నారు. భరతపద్ధతి యింక కొన్ని దినములు రంగస్థలముపైకి రాకుండెనా, తరువాత నయ్యది యుండదంతరింప వలసినదే.

నక్ష—అష్టప్రయత్నములును జరుగుచునేయున్నవి. కాని నేడు నా టకమునం దేమియల్లరి జరుగునో యని భయపడుచున్నాడ. ఏ మన.

సీ॥ భావార్థరసభావంబు మాయించుటన్ భరతుండుతా మేటివైరియయ్యె
ఇతరవేల్పులను రా నియ్యకోనమిచేత ప్రజయందు కొంత వైరంబు పుట్టె
రంభాది సతులఁ దొలంగించుటను గల్గె నంతః పురంబున నలజడికడు
ధనమెల్ల వ్యర్థమైయ్యె నటంచు కోశాధిపతులు గావించెదు ప్రల్లదమ్ము.

గీ॥ కలవర పఱచు చున్నది కడువడి మము
ప్రజల భావము మనయంద ప్రబలమైన
యభిమతిం గల్గియున్నద యన్నమాట
స్థిరము గా దింక; కొన్నియేం డ్లరుగు వరకు॥

1 రాక్ష- సాధ్యమగు నంతవరకు, బ్రతికక్షులకు లోనికి రా నవకా శము లేకుండనే చేయఁ బడుచున్నది.

2 యమ- అది భ్రాంతి. ఎట్లును అన్నిరకముల వారును రానే వత్తు రు. కాని యొక రహస్యము. నిరంజనుఁడు, వేగునడపుటకై వ చ్చినవాడని నా యనుమానము. ఋజువుచేయుట కింకను సావ కాశము లేదుగాని —

నక్ష—నాకుమాత్రము వానికి బోలిన విశ్వాసపాత్రుడు మఱియొ క్కఁడు గాన్పింపడు. ఎప్పుడు మంచివానినే శంకింతురు.

( ఇంతలో తలుపు తెరచి బయటనుండి సూర్యుడు తొంగి చూచును)

సూర్య—ఏమినక్షత్రకా కుశలమా!

నక్ష—సూర్యభగవానుడా—వందే—ఏమి ప్రయోజనము హరి శ్చంద్రనాటక మాడు నమర్థులు లేమిచే, నా నక్షత్రకత్వము పనికిరాక పోవుచుండెను. కొత్తపద్యములు, మంచి కీర్తనలు,

పెద్దపెద్ద భయంకరమైన స్పీచులు (వచనములు) వ్రాయించు కొని వల్లించియుంచితిని. తరువాత దర్శనము చేసికొందును. నమస్కారము—(సూర్యుడు తలుపుమూసి వెళ్ళును) మిత్రులారా! కానిండు, ఎన్నియో విశేషములు జరుగనున్నవి— ఎవరో వచ్చుచున్నారు.

నిరంజనుడు - (ప్రవేశము)

(స్వ) ఇన్నిదినములు నెట్లో బయల్పడకుండ గడపితి గాని నేడీ మూడు యామములు తీరెనా గురుకట్నము చెల్లించినవాడనే ఒక విచిత్రము! బిస మొందుండునో తెలియదు, మొత్తెరహాస్యమును యేకొంచమైనను బయల్పడక మానదు. మాంగురుపులగు భరతులవారు నేడిందు వచ్చువార్త తెలిసి గుసగుస లాడుచుండు వారు. అయన మెట్లువత్తురో ఎట్లుపోవుదురో మెవరికి తెలియును? వీరు పట్టుకొనగలరా, (ప్రకాశముగా) మిత్రులారా! కాలము సమీపించుచున్నది. ఇంకను కబుర్లమీదనే యున్నా రేమి.

నటి—(ఆపవారించి) వీరు నిన్ను విరోధిగా శంకించుచు న్నారు.

నిరం—(అప) వారు, శంకాస్పదులుగాని విశ్వసింపరు. గొప్ప కటిక వానిగాని నమ్మరు.

నటి—(అప) నీవు నేడు జాగరూకతతో మెలగి యేయుల్లరి జరుగకుండ సభికుల గనిపెట్టినగాని వీరికీశంక తొలగదు.

నిరం—(అప) వారి సందేహములు తీరుటకు చేయుదునా - నావిధి నేతప్పక నెరవేర్తును. కాని, సభికులలో గొందరు కొందరి తరపున చప్పట్లు కొట్టుటకేర్పడి యున్నారు. అది మానని చో, కొంత యల్లరి తానుగనే మానిపోవును. ఏమన, అభిమానము గలిగి చప్పట్లు కొట్టువో ఇష్టములేని వా రా సమయముననే

కేకలువేసియు మఱేవిధముననో చాల యల్లరిచేయుదురు. అది మాన్పఁజాలితిమేని, కొంతతీరును. మిగిలినయల్లరి మనమే మా నుపవచ్చును.

నటు—అట్లయిన నా వ్యవహారమే ముందు పరీక్షించి సవరింపవలెను. రమ్ము. మిత్రులారా! వేళయగుచున్నది. పోవుదము రండు.

(నిష్క్రమింతురు)

3వ రంగము నాటకశాలలో పరిభాగము,

[రంగస్థలము, మాయబడి యుండును. ప్రేక్షకులలో కొందరు రాజులు, యమభటులు, నిరంజనుఁడు, ప్రలాపకుఁడు, చండిముఁడు, సాగరుఁడు, సిద్ధుడు, దరిద్రుఁడు, సత్రికుడు, మఱికొందరుపురుషులు రంభ, తిలోత్తమ మొదలగు స్త్రీలు—సూర్యుడురాగా కొందరు లేచిపోవుచుందురు]

(మరల చప్పట్లు యీలలు)

పత్రి—అయ్యా, ఇందు వలన ప్రయోజనములేదు. వేషములన్నియు తయారుగా గానిదే నాటక మెప్పుడు ప్రారంభింతురు?

సభి—ప్రచురించిన దానికి రెండుగడియలు మించి పోయినది.

(మరలచప్పట్లు)

రాజు—అల్లరి చేసిన యెడ నాటక మాపి వేయఁబడును.

సభి—శాంతగానోఁడా కూకో నాటకా లాపేత్తావా, యీయిల్లు యిల్లంతా పూపేత్తాం. (గంటమ్రోగును)

సభి—అద్గో మొదలెడ్తా వుండారు. ఊకోండి. కూకోండి

[తెరలో హారతి] పాట - శంకరాభరణమేళం.

శ్రీకరా - కరు - ణాకరా మంగళ - దేహ - భాసురా అంచితరూపా -
నీ వ పా - ని స - మాగమా ని ని ని - పపప - సా ససా నీ ప ని సరిగా -
అవనిజాలోలా = మధుహరా మురహరా - భావాతీతా ॥
పా మా గా రీ - [illegible] సానీరాని - ప ని స రీ ॥

సభి—చాల్లేంహోయ్ సంతోషించాం తెరెత్తండి గంట సేపు చెయ్యక—

(తెరయెత్తగనే శుకుఁడు ప్రవేశించును)

(శిరమున మూరెడెత్తు జటాజూటము. గడ్డము మీసములేదు. ఒడలెల్ల విభూతి. పులితోలులాగూ చేతకమండలువు.) ఉపవీతి, నివీతీ, ప్రాచీన వీతిగా మూడుపూలదండలు (శిరముపైని జటకు తగిలించిన బంగారు పతకములు)

పాట. (ఆటతాళపుకీర్తనగా పాడదగిన వృత్తము)

వృత్తము॥ పరమపురుషా! భక్తవత్సల, పతితపావన శ్రీకరా
గరుడగమన విశాలలోచన కాంచనచేల రఘువరా
దురితదూర ! శీలవత్సు మధుఘ్న త్రిభువననాయకా
శరణు శరణు దనుజవినాశన శాశ్వతానంతాచ్యుతా

ఓహో తెల్లవార వచ్చుచున్నది. స్నానసంధ్యాద్యనుష్ఠానంబులు దీర్చుకొను సరికే నేఁడే లనో వేళమించి పోయినది.

సభి—గ్రంధకర్త సోమరి గాబోలు, నీకు వేళమించి నట్లు వ్రాసెను.

శుక— ఏమో. కానిమ్ము నే నింక తపస్సునకు గూర్చుండెదను.

(అని చెట్టుక్రింద నున్న కుర్చీపై కూర్చుండి కన్నులు మూయుచున్నాడు)

రంభ—(విలువగల చీరె జాకెట్టు నగలు శిరమున ఎడమభుజము పైనను ఎరెక్ట్రి, కుచ్చెలు గజ్జలు గలిగి ప్రవేశించెను.)

పాట మోహన త్రిశ్ర

1. ఎంతో ధన్యరాల నా- నే- "కంతుని కేళి నేఁడు లభించె, దాసరిసదాపాగపదపగరిసరిగసా- గాపాపదసాదసరిగనగపాపదపాస ససాస, జయంతునికన్న- వసంతునికన్న- ననంతునికన్న మఱింత వన్నె కాఁడు
దదగరిసస- దరిరిసదద- పదసదపగరిగసరిగపద॥

2॥ ఆహా వీనిగన్న మోహాతిశయము దేహస్ఫురణము లేకుండఁ జేసెఁ -స్నేహా మీ తీర్చని-దాహముల్ -యెటులో...............॥

ఆహా వీని తనూరామణీయకము తనివిదీర నమభవించు యోగ్యరాలెవ్వతెయోగదా. బ్రహ్మ యెంత విపరీత ప్రవర్తనముగల

ఉ॥ చిత్తజసన్నిభుండు నిరసీకృతచారుశ, శాంకమూర్తి ధీ
రోత్తము డుజ్జ్వలుండు మహితోన్నత వక్షుడు వీని నీవిధిన్
సత్తపమందునిల్పి యల జాక్షులనిండల పాలు సేసె నా
పెత్తనపున్ విరించి, యవి-వేకపు చాందస చక్రవర్తియా

సీ॥ కుందనంపు మెఱుంగు చందమ్ముగలమేను చందనచారు చర్చలకుగాక,
విద్యుతిఁద్యుతిబోల్చు మిలమిల్లుకనుదోయి కర్పూరపుం గాటుకలకుగాక,
అమృతంపుసోనల విమలవక్త్రంబు మధురాన్నభుక్తిసంపదకుఁగాక
దీర్ఘమౌచునస్త్ర దీప్తినిం పెసలారు ఫాలమ్ము కురులచెల్వముకుగాక,

ఆ॥వె॥ బాడిదలకు ధూమములకు- దుంపలకును
పెనసి జటలుగాగ ప్రేలుటకునె.
ఆహహా బ్రహ్మదేవునవలె నేగాని
వీడు తపమునుండి వెలువడుటెటు॥

సాగ——ఒకమూలనుండి యొకమూలకుదేలు నాదస్తూరివలె, ఒక భావములో నారంభమయి మఱియొక భావమునకు తేలిందేమీ పద్యం.

రంభ——

ఉ॥ చూచినఁజాలదే యితనిసోయగమున్ కనువిందుతీరు పే
ర్చిచినఁజాలదే పలుకరింపగనన్నునితండు, నాదుచే
సాచినఁజాలదే వడిగ శయ్యనుజేరఁగరమ్మనంగ నో
బూచులవాడి వీని మన ముంకరగించుటనాకు నెన్నఁడో॥

సీ॥ రారామనోహరా రారారమాసమా రామారతిరవరాయటంచు
కేళివిలాసవిలోలవైతిని జాల మేలరా యేలరా వేలయటంచు
మారనారాచవిహారాతిదీప్త ఘోరార్తి దూలితిబోవరాయటంచు
సారంబు వారవిచారాంబుధింజేరి ధీరతగోల్పోతి దీక్షనంచు

గీ॥ వేడుకొన్న నితండుమారాడఁడకట, మౌనముందాల్చియున్నాఁడు
మన్మధుండు నన్ను క్రీడకంగనీయఁడే తెన్నుగలదు॥

అక్కటా యేమిసేయుదు నార్తిమీరి.

(పద్యము చాలవ్యత్యస్తముగా చదివి రాగము విసరుచు పాడును)

సఖి—అర్థజ్ఞానము లేకపోయినా అపటస్వైనా తెలిసియుంటే బాగుం డేది పైగా యిన్ని పద్యాలెందుకు?

శుకు—(కన్నులు తెరచి) నేను తెల్లవారుజామున మెలకువ రాఁగనే దుశ్శకున మైనది ఏమా యనుకొంటిని ఈ విధముగా తపోవిఘ్న మగుటకుఁ గాఁబోలు (చూచి)

కమాచి—జంపె

ఎవతయీసుందరి - లోలయిటువచ్చెహా
సువర్ణద్యుతిమీరెడుణ - సోయగమేపారెడుణ
(పైన) నన్ను కామించి వచ్చియుండెనా.........
చిన్నబుచ్చి పంపవలయు నేగదా............

తిరి—వన్నెలాడిరో లోలవచ్చితివి - పన్నుగమనవి జేసికొమ్మా.

రంభ—(పైన) పన్నగారివాహనతనయ సన్నిభసుందరా - నన్ను రంభయందు రు నామనవివినవేల తొందరా.

తిరి—ఇదే విన్నవించెదను, ముదముమీర నాతోడణ సదయకామకేళి గదియరమ్మా॥ ఎంతో ధన్య

శుకు—(చతురస్ర) ఎంతభ్రాంతి పడిచనుదెంచితివే యింతీనాతో నీకగునా, పొలంతీ నీతో నాకగునా?

తిరి—సంతసంబుమీరగ నింతనైన నెదుటనేనిఁ జనగదే

రంభ—ఆహా-హా-హా ఇటులనదగునా - నను విడువగనగునా? ఎంతో ధన్యరాల

శుక—(గానము లేక తాళముతో) నను నిపుడేమి సేయనుందువే

రంభ—నినునిట కౌగింలిచుకొందు రా॥ ఎంతో ధన్యరాలను

శుక—ఓసీ కూరరాకాసీ, చాతురదోస్తంభా, రంభా, నీతలపు మానుము ఇంక నెందైన జనుము

రంభ—(కులుకుచు) నావలపు మాన్పుము. అంత నేమైన ననుము.

శుక—నీకులుకు దహానునిపాలు గావలయుగాక నేనీకు వశమగు దునా.

గీ॥ కౌశికుఁడఁగాను నేను విక్రమంబు వినుము
ఇంద్రుఁడనుగాను; గాను దైత్యేశ్వరుఁడను

(మఱచి రాగము తీయుచుండును)

2 సఖి—త్వరగా అందియ్యండయ్యా రాగంతో చచ్చిపోతున్నాము.
రాక్ష—కామూష్
3 సఖి—హాంష్
2 రాక్ష—ఎవఁడురా ఆ మూర్ఖుఁడు.
5 సఖి—నీవేగా శుంఠా
నిరం—అయ్యా అల్లరిచేయక ఆలకింపుఁడు.
4 సఖి—నోరు మూసికొని కూర్చుండుఁడు.
నిరం—(రాక్షసభటాదులతో రహస్యము) మనమూరకుండనియెడ అల్లరి యధికమగును.

శుక—

గీ॥ బ్రహ్మరుద్రేంద్రియును నా తపస్సులకును
విఘ్నమొనరింపఁ జాలఁడీ వెఱ్ఱి యేల?

నా మాట వినుము. కిన్నరకింపురుషఖేచరాప్సరఖగనాగవరారోహావార మమందసౌందర్యస్వరూపములతో వచ్చి నిలతురుగాక, పంచబాణుండు నన్ను వంచింప సమంచితశరసంచయము నిరాటంకముగ నాపయిం గురియించుఁగాక, హరిహరబ్రహ్మేంద్రాదులు పరివారముతోడ విచ్చేసి నన్ను పురికొల్పుదురుగాక, క్రూరదనుజానీకము............(తడబడుచున్నాడు) దివ్యవత్సరంబులు......ఉ...(రాక, అందివ్వచ్చుకొనుటచేతకాక) పెక్కుసహస్రంబులు,.........తపంబులు......సలిపి వరంబులంది నన్ను............హింసింపఁదలకొన్నను......

సాగ—చక్కగా వల్లెవేయక ప్రదర్శనములో పాల్గొను వారినుప్పాతరల నూరవేయుట మేలు.

శుక—నేనెనుదీయను, నిన్ను నుపాతింపను

4 సభి—ఎట్లో దాటి యీవలబడితివి.

1 రాక్షు—ఊరకుండ జాలరో.

5 సభ్యు—ఊరగాయ గారురో.

శుక—ఆ కారణమున నీవు పడెదు శ్రమయెల్ల అనుచితము. అవమానకరము. అవివేకభూయిష్టము. ఆలోచనాశూన్యము. ఇడుమలకాకరము. ఈడులేని సంతాపముగలిగించును. ఉచితముకాదు. ఊరక చెడియెద వేల. ఋజుమార్గసంహారకారణము. ఎఱిగి ఎఱిగి వృథాయాసమేలపడవలయు. ఏబాధయైనపడుము నేనొల్లను ఒల్లనివానియెడ నేటికీమరులు. (ఉపన్యాసపద్ధతిని చెప్పును.)

4 సభ్యు—ఓహో ఈ అకారాదిపట్టిక యేటి బాబూ ఇంక చాలించు నీ ఉపన్యాసధోరణి.

శుక—ఓమహేశుని శాపలకు వెరువను. కమ్మవిల్తుని కాకలకు జంకను ఖరకిరణుడు నన్నేమియు చేయజాలడు.

5 సభ్యు—యరలవ లవరకు పున్నాయిగాంబోలు సోద!

శుక—(రెండుచేతులతోడను తలపట్టుకొనును)

6 సభ్యు—ఏమీ తలనొప్పుచున్నదా. 'అన్నినొప్పులకును అనువైన మందు అమృతాంజనంబు.'

శుక—(తెరలోనుండి అందిచ్చుచుండగా నేనిక చెప్పనని మిన్నకుండెను)

రంభ—ఆర్యా ఏల నీకింత వైరాగ్యము. గాఢమైన నీయవ్వనమునివ్వనము పాల్సేయనేల? నీసౌందర్యము నీమందానికి కర్పింపనేల? నీవిలాసము నీపలాశముల వ్యర్థపరుప నేల? నీయొయ్యారము నానెయ్యంపువలపులో వియ్యమందకూడదా?

శుక —— పాట - కాంభోజమేళం - ఆది

(1) ఇసీయింకయిటులిటుపలికెదే? - పసంజూతునింపుగాదుపోపో - పావమనిమది
పసాసానిద ప మ గరీ - నిసా రిరి రీ ప మా గసాసా - రీ మగ రిసస
నినెంచవో - తాపముదీరినతనివిదీరునే ॥
రిసరిమపా - దాదదరీ రిరిపదసనీదసా ॥

గం (2) కాంతలయెడననుకంపవహించిన - పురుషులులేరేధరలోనన్ ।
ఇంతులువేడిన నొల్లని పురుషులు - కీర్తింబొందరే ధరలోనన్ ॥

శుక —— అట్టిదృష్టాంత మొకండు చూపుము.

రం —— వినుము.

క॥ చింతామణి వేడుకొనఁ బంతనమున నీకిఁ వ్యాసంగముఁ దాఁ బెన్ ।
రంతులఁ దేల్పఁగ యతనికి యంతమ్మున భక్తి గుదిరి యశము గలుగదే ।

మఱియు,

సారంగధరుని వేడిన సారంగకుణానునొల్ల జాలకఁ జనిగా ।
సారంగధరుండేమయె ఘోరాటవులందు నుర్విక్రింగ కొరగిం బడడే ॥

శుక —— నీ కుపమానములు దొరికినందుకు చెప్పవలె నీవెన్ని చెప్పి
నను నేనీమాటవినను నీవు నన్ను విడుచు నట్లు తోచదు. నేనే
నిన్ను విడచెద.

పరువెత్తి నిష్క్రమించును.

రంభ హాహా, విడిచిపోయెదవా. పోయెదవా.

( చేతులు క్రిందనానుకొని నీరెచెడు నేమోయను భయముతో పరుండి
మూర్ఛిల్లుచున్నది.)

సభ్యు —— శభాస్ చీరె గౌరవము కాపాడితివి.

చండి —— నాట్యగౌరవమును గాపాడబడినది. ఎట్లంటేని

ఉ॥ చేతులు త్రిప్పలే కొకరిచెంతకు నొక్కరు చేరలేదుగా
మాటలుమారలేదు మొగముల్ రసభావము జూపలేదు ని

ర్యాతపరిశ్రమను గతియించి చక్కగ నొచనేమియుక్
భీతియు ప్రీతి యుండనుభవింపరాదను మాత్రమేనియుక్

దీనిని నిర్జీవనాట్యమందురు. భరతపద్ధలో దీనికి సరిపోయి నది సాత్వికాభినయము. ఇందులో కష్టమంతయు, నిరంతరఘూమక ర్ణాకశీలుండయి గా చెంత పుస్తకము పట్టి చదువ నెఱుంగని న టులకుఅందిచ్చు నుద్యోగభారము దాల్చిన వానిదే సుమా. కూలిగి ట్టనుగాని..........కాని ఈతడు సార్థకోద్యోగి.

డిక్ష—ఎట్లు-

డబి—ఎట్లా! నాటక ప్రదర్శనము నడిపించు భారమెల్ల యీతని యందే గలదు. ఇదెల్ల యొకవైలు బండీ వంటిది. అన్ని పె ట్టెల నీడ్చుకొని పోవు ఘూముశకటయంత్రి మొప్పుడును పొగ విడుచు చుండదా? అదిగాక రంగస్థలమునందుండు వారికి ఇతేల గలిగి నప్పుడెల్ల లోనికి పోయి తామే కాల్చుకొని రా నవకాశ ముండదు. అట్టిచో యీతడు వారికి తోడ్పడుచుండును.

డిద్ధ—విషయమును చక్కగాసాధించితివి గాని, చూడు, రంగస్థల మున కెవ్వరింతవరకైనను రాలేదు,

(చప్పట్లు—యీలలు)

సాగ—హార్మనితబ్లావాళ్ళు రంగస్థలమ్మీద నటులున్నప్పుడు పాట కచేరీలు చేయకపోతే యిటువంటిసమయాల్లో చేయరాదు? వారికి పీరిని పీరికివార్ని చూడక యుద్రేకము గలుగదు గాబోలు.

1 సభ్యు—ఏమండీ యెవరూ రాకేం.

డిద్ధ—అయ్యా కారణము చెప్పెదను. యముడు రావణుని వేషము దాల్చు. రావణుడు నల్లనివాడు. యముడును అంతే. అయితే అల్లి రంగస్థలమునకువచ్చిన రంగులు లేవనుకొందమని యో తనరంగు సభికులుచూచి నవ్వివోవుదురనియో, ఆయు చబంగా రపు రావణాసురుడై వచ్చును. అట్లగుటకు ఆలస్యము. కమిం

1 సఖి—అయిన మున్దే వచ్చి వేషము వేసికొన రాదూ?

డిద్ధ—అది దర్జాకులోపము, ఒకటి, రాగనే వేషము వేసికొనవలెనా? ఏ యేస్నేహితుడు వచ్చెనో చూడవలె. వారితో మాటాడవలె. ఇంకేమి యేర్పాట్లు చేయవలెనో? నటుల యవస్థలు మీకేమి తెలియునయ్యా.

రాకు—ఎందులకంటే యీ సిద్ధాంతములు ఇష్టములేనివారు వెళ్ళ వచ్చును.

దబి—నీకు తెలియదా? రంగస్థలము నిర్జనమై యున్నప్పుడు సభా రంగము నాటకమాడి తీరును.

రాకు— ఆ అట్లనా (కొట్టబోవును. సభలో ననేకులు లేచి వాని నావలకు తరిమివేయుదురు)

1 సఖి (పాడును) వచ్చుచున్నాడు యముడు, రామణుడు గా.

(రామణుడు పచ్చని ముఖముతో పూర్వోక్తమైన యముని వేషము ధరించి వచ్చుచున్నాడు)

రామణుడు (పెద్దనప్పనవ్వి) పాట - భైరవిమేళం - తిశ్రి

ఎవతెయిచ్చట నిదుర జెందుచున్నది? రంభయా కరటోస్తంభయా - ఘనప్రా
సపప మమమ గ గ గసా రిసరీ. రి రి మా మమమారి రి మ పా - ప పపని
రంభయా॥

దమా॥

(గద్య)

అ.............నేనెంత యదృష్టవంతుడను...............
తిరిగితిరిగి వేసరి తుదకు కనుగొంటిని...............
లేవవె - లేచిమాటాడవే - కౌగలింపవే...................
సాసనీ - పాదమాసాసనీ - నిదపమరిగమప॥

(రంభ, ఎంతసేపటికి లేవకపోవగా)

1 సఖి—ఈ వయ్యారి నరుచే మేలొందు ఎపండి నిమరించుచుండెనేమో

(లోపనుండి గడ్డ వేయుదురు) రంభ ఉలికిపడి లేచును.)

చండి——ఇప్పుడుగదా రంగస్థలమున నభినయము చూచినారము.

రావ——ఇప్పుడు నీముఖము చాలవింతగ నున్నది. రంభా (అని హార్మనివానివంక చూచుచున్నాడు. హార్మనీవాడు తబ్లావానితో మాటాడుచున్నాడు)

డబి——నాటకంలో యీమాట వున్నదీ అయితే కవి అభిప్రాయంలో యీనిద్రి వున్నదన్న మాట.

రంభ——అయ్యో నీవెవ్వరు.

రావ——(అనుచు కొంత రాగము దీసి)

శా॥ బాలా ఏమని చెప్పవాడవు దమి - నిల్వంజా (రాగము) లకీర్తార్తిలో
(రాగము) వాలా (కొద్దిరాగము) నంబు శరీరమెల్ల యలయంగ - పద్దేశముల్
జూచి (రాగము) నిన్నే లీలం గనునోందునా (రాగము) యనుచు నింతే బాధ
లంగాలి, ఈ (రాగము) వేళంగాంచితి రాజరాసురుడ రం - వేచంద్రి - కిం
బాధగా (రాగముకొంత ఈయనియు ఏయనియు పాడుచున్నాడు)

సాగ——ఈపద్ధతి బాగున్నది అందరు చివరనే రాగముదీసెడువారు ఈతడు పద్యమంతయు రాగమయముగనే పాడెను. అందులో ముందుకూడ రాగముపాడుట మరీమరీ క్రొత్తపద్ధతి.

డబి——ఇది మధ్య మంచువా చుట్టు సలుపంకల దొడ్డిగల బంగాళా పద్ధతి పద్యపఠన మార్గం. కాని శానాశ్రిమఅయింది.

రంభ——అయ్యో దేవతలకును రాక్షసులకును విరోధముగదా నన్ను కోరదగునా?

రావ——అన్ని విరోధములు ని పుట్టుటచేతనే పోయినవి. మఱియు ఇదియేమి? విరసముగా మాటలాడుచున్నావు!

ఉ॥ ఆకులు దుంపలుం ఫలములా (రాగము) కపిదీర్పగ కానవాసిమై
శీకులచింతలం - మునిగి చిక్కిన మే (రాగము) గలయట్టి మానినిం
నాకును గల్గు భేదముకనం బడదే లలనాశిరోమణీ
నీకు కుడుంచువారు మఱినీవును మన్మథ తాపకారికుల్ ॥

రావ—ఓహో. ఏది రంభ? ఆహా కన్నులలో దుమ్ముజల్లిపారిపోయి నదిగదా.

డిద్ధ—నీ ధ్యానము మామీదనుండబట్టి యిట్లాయినది.

రా.ము॥ పాట. కానడా అట. (రాగమయముగా)

ఎందుకెదకుదునే సుందరీ తొందరపడితివిగదే
మందగమనా ఇందువదనా కుందరదనా (అనిపాడుచునిష్క్రమింతురు)

(తెరజారును)

డిద్ధ—ఓ తెరా, నీవుకూడ తొందరదనా అని పాడుచు పడజాల వైతివిగదా?

(ఎంతకు తెరయొత్తకుందురు)

సాగ—(పాడుచు) తెల్లవారవచ్చె తెలియుచుండ లేదా. తెరయొత్తరే మయ్యా కర్మము. (భూపాలరాగము)

డబి—హార్మోనియంగారూ. మీరైనా కాస్తైపు వాయించండయ్యా విని పోతాం. (తెరయెత్తుచున్నారు)

(సభలో చప్పట్లు తెరయెత్తుతున్నార్లే అని కేకలు)
హార్మోనీతబ్లావాళ్లు బైటబోయినట్టున్నారు. పిలవండోయని యీలలు. వారు వచ్చి కూర్చుందురు)

రావ—పాట-కానడ-ఆట

క్వానరేరంభను- కానడా నినహా. మాననీయమహీధరము లారా! చెరువులారా॥ పరువులారా తరువులారా దొరువులారా శుకపిక శారికములారా.

డిద్ధ—ఏమండో నాట్యమూలలా తిరగండి లేక పోతే కనపడదు. స్వరం తగ్గిపోయిందేం తమ్మ ఊసి పాడాలిదూ?

రావ—ఇస్సిరో ఈపరితాపము నేనింక భరింపజాలను భరింపజాలను భరింపజాలను. (స్వరము తగ్గుచురావతెను) భరింపజాలను.

(శృంగారగానోత్సవముతో) ఓరీ క్రూరుడా మూఢుడా చోరుడా. దుర
హంకారుడా. నీవుండగము లింక చాలింపుము. చాలింపుము.
చాలింపుము. (హీనస్వరముతో) చాలింపుము. మిక్కిలి పెద్ద
గొంతుతో) చాలింపుము నీవు నన్నేమిసేయగలవు! నీవు రూప
రహితుండవు. అదిగో నారంభ—(మ్రొక్కుచు) సకలసద్గుణ
ప్రారంభ (కుంటివానివలె దాట్లు వేయుచు) మృదుల నీల శిరోజ
సంతాననిర్జితరోలంబ, నిర్దాక్షిణ్య పరికల్పిత రావణ విప్రలంబ—
అదిగో—రా— రమ్ము— రాజాలవా (ఏడ్చుచు) రాజాలవా.
అయ్యో నీకేమి బాధ గల్గినది. నీకాలిలో ముల్లు విరిగినదా. నేను
తీసెదను. తీసెదను. (నవ్వుచు) నను కౌగిలించుకొంటివా.
కొంత తృప్తియైనది. అయ్యో మరల పారిపోవుచున్నావా? పోవు
చున్నావా? ఇదిగో నేనును వచ్చుచున్నాను. వచ్చెదను. వచ్చి
తిని-తిని- ని (పరుగెత్తిపోవును)

డిద్ద—ఎవరండీ ఆపరుగెత్తినది. నేనేమో సనకమనుకున్నాను.

సాక—అలాగేవున్నది గాని పరుగు, రావణాసురపాత్రము.

రంభ—

సీ॥ వదులార పదులార గదులార మదులార సోదలార కానరె శుకుని మీరు
గతులార తతులార వతులార హతులార సుతులార కానరే శుకుని మీరు
మరులార నారలార కోటలార చెరలార నురలార కానలే శుకుని మీరు
మొనలార కొనలార పనలార ననలార సొనలార గానరే శుకుని మీరు

ఆ॥ వె॥ వెదురులార ముండ్లపొదలార చెదలార
కుంటలార సీస్గపెంటలార
పుట్టలార తేనెపట్టులార మీరు
శుకుని గందు గాని మాడ లేదె

అయ్యో యెందుబోయెనో గదా! ఎందు గందునో గదా! నాక
ర్మమునకు దోడు రావణుడొకడు వెంటబడెనే. నేనెట్లు తప్పించు
కొందు. కాకులకు జిక్కినకోతివలె నైతినే. (కూలబడి) హా! అప్ప

రాంగనాశతహస్తవిన్యస్తసమస్తాంబరభూషణమండితదేహాను, నిఖిలభూపరాజకోటీరమణిప్రభావిరాజిత సుందరోరువిశాలవక్షస్థలను. (లేచి)

సాగ—ఆసమాసాలన్నీ విడిచి చదువుదూ, మీకూ మాకూ కూడా అర్థంగావు. (చప్పట్లు)

మేన—దానినడక చూడవే తిలోత్తమా, పిల్లికూనపరుగు,

తిలో—రసపుంబట్టులున్నట్టు మాటాడుచున్న దేమి?

ఊర్వ—మనరంభ యిప్పుడారంభయున్న యవస్థలో గదా! శుకుడే యనుకొని వాని వరించెనా?

రాక్ష—ఏవరమ్మా ఆడువాండ్లు మాటాడకండి.

రంభ—(మరల సద్దుకొనుచు కూర్చుండి) హా సుందరాంగ రావణ విశాలాయత వీక్షణా. ఈక్షణము నీవు సముజూడరాకున్న నే మనజాలను. త్రిభువనవినుత సౌందర్యగాత్రుండవు, సకలచంచలేక్షణానిటలము మనోంబుజాత సహస్రకిరణుడవు.

ఊర్వ—ఇదివరుసా సంతోషమూ పన్నులుమాత్రం కొల్పించుచున్నవి

రంభ—అక్కటా మనోహరా. నిన్ను వెతకి యెట్లుని కనుంగొని తీరెదను. [నిష్క్రమించు]

శుకు—రంభ నాకొరకే వెదకుచున్నది. రంభకై రావణుడు వచ్చెనని తెలసె. ఓరీరావణా (వడకుచు పండ్లు బిగించి దండము సారించి)

శా॥ రంభాభోగపరాయణుండవయి యారంభించితే గ్రుమ్మరన్
జంభారిప్రముఖాఖిలామరగణశ్లాఘ్యున్ పదింగొరెదే జృంభింపన్
శుకుడేస్మియయ్యెనో ఖరాసిన్ బూనినన్ ఛీలన్,
దంభీభూత సమస్తతేజుండను నాకున్ నీభయంబేలరా॥

(కలిసి ఒకగుర్రక్కలో పాడును.)

(సభలో సోడాబుడ్డి పంపండి గొంతు పడేసేనా యని కేకలు)

రంభ శుకుని వరించెను. ఈశుకుడు దాని తృణీకరించినను మరియొక్కండు వరించి గారించుట యొఱింగి తన పత్నిష్ఠ పాను చేసికొన జాలునే (మీసములు త్రిప్పబోయి సిగ్గుపడి) దూర్ముడా నీపట్టుదల విడువుము. లేదేని, (పరవడలు దొర్కుచు)

సీ॥ కార్తవీర్యుండు నిన్ గట్టినచందాన, చెరయందు గట్టియుంచెదను నిన్ను
వాలియంబుధులందు నోలిముంచినరీతి చెలఁగి సంద్రములముంచెదను నిన్ను
నిదానోత్తమాంగంబు నెమ్మినంగదుడు దన్నెనుగదా యటులె తన్నెదను నిన్ను
కులముతో రాముండు గూల్చగా నిను నట్లె మొదలంట సంహారించెదను నిన్ను
గీ॥ అస్త్రమేమి వచ్చెదో అనికి రమ్ము॥
రంభ—(పరుగెత్తుచువచ్చి) అక్కటా నన్ను రక్షించు నాప్తులే యవని లేరె
రావ—(వెంట నేవచ్చి)
నిన్ను విడిపించి రక్షించు మన్నె కాండ్రు పుట్టలేదింక పుడమిలో పూవుబోడి
(వెనుకదిరిగి తెరలోనుండి గద నందుకొనెను)
శుక—ఓరీ పుట్టలేదనుచున్నావు గదా రేద్రిమ్మరీ, ఇదిగో నేనే దీనిని సంరక్షించెదను.
రావ—(కత్తిదూసి త్రిప్పుచుండగా పిగ్గకు తగిలి యూడిపోవును)
(లోనికి బోయి తిరిగి దాల్చివచ్చును)

పాట—ఆది—చలనాట

పటాపంచలుగా సేతు - నెవ్వడడ్డమువచ్చిన వానిశరీరము
పసాసాసానిపాపాప - మామసాపమరిససాసాగమపాపప
శుక—ఖంచబంగాళముగా సేతు - దీనిబట్టదలచినవాని సర్వస్వము
సాగమాపామగమమామ - గరిసపన్నిపమగరిసానిసానీపమ॥

రంభ—హంసధ్వని—త్రిశ్ర

అనంగసుందరా - కార నామనోహరా ననుంగటాక్షమంచి బ్రోవరా
సనారిగాసపా - సాసాంపారిగారిసాససాగగారిగాగపానిపా
రావ—బ్రోవగనిత డెవ్వడే
సానిపగపగారిసా
శుక—వెడలుము దానవా
నీపగరిగసాసాసా॥

ఓరీ దూర్తస్వాంతుడా నీయాగడ మిచ్చట జెల్లదు. అబలల బలిమిం బట్టి బాధించెదురా
రావ—తెలినది నీవృత్తాంతము
గీ॥ మంచుచాటున నీ తండ్రి మన్మథార్తి దీర్చుకొన్నాడు. తరువాత తెల్లముగను
పాండురాజాదులకు తండ్రి భావమరది అట్టివాని పుత్రికుడవైనందులకును॥
గీ॥ దీని రక్షించు భారము పూని యిపుడు నన్ను తరలింపనున్నావు.-
(శుక్తిరాకపోవారకుండెనులోన పుస్తకము పుస్తకమని కలవరము)

1 సఖి—ఈ కథ యెక్కడిదండీ.
డిద్ధ—(సభచూపి) ఇక్కడిదీ (రంగస్థలము. జూపుచు) అక్కడిదీ.
2 సఖి—అనగా
డబిద్ధ—శుకరంభాసంవాద మొక చోట నున్నది. రంభా రావణ
సంవాద మొక చోటనున్నది. ఈ రెంటికీ లంకె బెట్టి యీనాటకం వ్రాయబడినది.
3 సఖి—దేశ కాల పాత్ర లక్షణము సమసి నల్లు కదా.
రాక్ష—శుకరంభసితిపద్ధతికి దేశ కాలపాత్రసంబంధము లేదని యెఱుంగుము.
సఖి—అపాత్రుల కెప్పుడు అంతే.
రావ—గీ॥ నన్ను తిరలింపనున్నావు నిన్నె గాదు
ముజ్జగము లేగు దించిన పోరునందు। జయము గైకొని కొందు నీచాన నేను
శుక—ఓరీ ధూర్తా మానాయన గారినే నిందించు చున్నావు రా!
క॥ నరమాంసాశనుడవగుద। తరుణుల సాధువుల నేర్చు దౌర్భాగ్యుడవై।
ధర నిన్ను గెలుచువాడో। క్రూరుడను లేదెమి? మఱచి కారులరచెదె॥
ఓరీ యిటువినుము
మ॥ నిన్ను బంధించిన కార్తవీర్యార్జునుని ప్రశంసించి యంబోధులం
దునముంచెత్తిన వాలియుం మరియు నిన్ దూలాడు నారాముడుం
గనలేకుండిరె వారలేమిటికి? వీకన్ యోగదండంబునన్
నిను నీసర్వము నేహరింపగలరా నీచాత్మపాపాత్మకన్
రావ—అయిన నేమానోమాంతము (అనిరంభను బలవంతముగా నెత్తికొని పోవుచున్నాడు.
సఖి—యేమయ్యో! - ఉండు భాగస్వామీ నేకూడా వస్తున్నా.
శుక—(కోపముతో) ఓరీ దుర్మతీ! ఇదిగో శపించుచున్నాను (తీర్థము చేత ధరించుచున్నాడు)
భరతముని (నిజస్వరూపముతో ప్రవేశము) ఓయీ నీశాపము నాటకములోనిది. కావున బూటకమైనది. ఇదిగో నేను నిజమైన శాపమిచ్చుచున్నాను.
మ॥ పరమోత్కృష్టకళాస్వభావము చెడన్ పాపాత్ములై యీక్రియన్
విరసాలాపపటిష్ఠకార్యరచనన్ బ్రీతిన్ బ్రసంగించి బం

దురభావార్థ రసప్రతీతికి విరోధుల్ గా విరాజిల్లు చుందురు గా!
బుట్టుకు నేడె హీనగతినెందో యల్పలోకంబునన్॥

చతుర్విధ పురుషార్థసాధకంబైన నాట్యము నివ్విధంబున ధ్వంసపఱచు మీరు వేల్పు జన్మము బాయుదురుగాక! ఏనెంవడయు మీ కంటకుండుగాక! (నిష్క్రమించుచు)

(అంత నటులు, ఇంద్ర, శుక్ర, శమనాదులును ప్రవేశింతురు అప్సరలు వత్తురు)

శుక్ర—మనమింక విచారించినం బ్రయోజనములేదు శాప మనుభవింపక తీరదు. అయినను మనము మనుష్యలోకమ్మున బుట్టుదముగాక! ఈతని శాప మీతనినే పరాభవించులాగున నందుని పరిహారమునందే ప్రవర్తిల్లెదముగాక!

విశ్వా—అకటా యెంత యుపకారముజరిగినది! శాపమ్ము లిట్లుగుంగాక!

సీ॥ భరతనాట్యపద్ధతి లోక వారమందు । లేకపోవును గాక! యే సీల నైన
నుద్ధరించెడు గతిగలుగ కుండుగాక! । స్వర్గమందు మీరలకు వావాస గరిమ ।
లేనియెడ భయమేమిటు సేయ గలుగ । నరక నా ద్రిశంకుండున్న స్వర్గమందె॥

శుక్రి—ఇదిగో - ఒక్కరొక్కరే యీ జన్మము నొలంగుచున్నారు.

(అందరు పడిపోవుదురు విశ్వామిత్రుడు మంగళము పాడును)

సభి—ఓహో! యిది మంగళవిషాదాంతనాటకమైనదే (అని సభికులొక్కరొక్కరే నిష్క్రమింతురు)

విశ్వా—(ముందుకువచ్చి) ఆహా! అందరు జన్మాంతరము నందం బోయిరి. శుక్రుడును, పోవుచున్నాడు. ఇంతనుండి నాటకాంతములనుండు భరతవాక్యము శుక్రవాక్య మనంబరగుగాక!

(వృత్తమాలిక) శుక్రవాక్యము

ఉ॥ హార్మోనియమ్ము తబ్లయును హార్మొటిలన్ నవగాన వైఖరుల్
సీ॥ వైభాషికోచ్చారణా భావము ఘటిల్ల నటులు శబ్దోచ్చారణమ్ము నలుప,
మ॥ ప్ర॥ ధనికుల్ తమ్ముక్రినాట్యోద్యమ మున చెలువు గాదన్ సహాయంబు సేయన్
ఉత్త॥ గాలివాటపు పాట కంఠయు గౌరవమ్ము ఘటిల్లగన్
సీ॥ చేతి వాటపు యాక్షను చెన్నుమీర,
తే॥ శుక్రుని నటపద్ధతులకు శోభ పొసగుగాక॥

(నిష్క్రమించు చున్నాడు)    తెర జారుచున్నది.

ఇంద్రసభ సంపూర్ణము.

